# సమాలోచన



## జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక

సంపాదకుడు: విద్వాన్ బులుసు సీతారామ శాస్త్రి.

సంపుటము 1 రాజమహేంద్రవరము 16-2-1978 సంచిక 8



1, 16 తేదీలలో ప్రచురింపబడును.

చందా
సంవత్సరమునకు రు 10-00.
అర్ధసంవత్సరమునకు రు 5-50.
విడిప్రతి 50 పై.



## —* ఈ సంచికలో *—



1—3—78 సంచికలో రమణీయ స్వీయచరిత్ర, కందకవి చక్రవర్తి, వ్యాస నిష్క్రాసం - కాశీఖండ భీమఖండాలు మొ॥ ఉంటాయి.


అడ్రసు :—

సంపాదకుడు,

**బులుసు సీతారామశాస్త్రి,**

6-8-7, ఇన్నీసుపేట (త్యాగరాజనగర్)

రాజమండ్రి-1.




సిద్ధాంతాల ప్రాతిపదికల ఆధారంగా ఆ మూడు నవలలను విశ్లేషించి చూపడం ఇక్కడ జరుగుతుంది.

## అల్పజీవి

రాచకొండ విశ్వనాథశాస్త్రి సాంఘిక ప్రయోజనం దృష్టితో అల్పజీవి నవలను రచించారు. ఈ విషయం నవలారంభములో రచయితే చెప్పుకున్నారు. ఈ రచయిత నవల్లో జీవితంపై ఒక దృక్పథాన్ని కల్గింపచేస్తాడు. రచనా విధానంలో రచయిత అనుసరించిన పదునైన శైలి, సంక్షిప్త వాక్య విన్యాసం రచనోద్దేశాన్ని స్పష్టతరం చేస్తున్నవి.

మానవునికున్న గుణాల్లో ధైర్యగుణం ఉత్తమోత్తమం అంటాడు రచయిత. ధైర్యం లేకపోతే మానవునికి అన్నీ సమస్యలే. అతనికి సుఖశాంతు లుండవు. అందువల్ల మనః క్లేశం తప్పదు. మనిషిలో ధైర్యగుణం లోపిస్తే, మిగిలిన సద్గుణా లతనిలో వుండటానికి ఆస్కారం లేదంటాడు రచయిత. పిరికివా రెవరూకూడా మంచివారు కాజాలరు. అంటే మంచికి నిలబడ లేరన్నమాట. మంచివారుగా వుండాలి అంటే ఎంతో గుండె నిబ్బరం కావాలి. ధైర్యస్థుడికి గుండె నిబ్బరం వుంటుంది.

అల్పజీవి నవల్లో సుబ్బయ్య ప్రధాన పాత్ర. ఇతడికి ధైర్యం లేదు. చిన్నప్పట్నుంచీ పిరికితనం ఇతడిలో చోటు చేసుకుంది. ఇందు కొక బలమైన కారణం వుంది. చిన్నతనంలో తల్లిపోవడంతో సవతి తల్లి పెంపకంక్రింద పెరుగుతాడు సుబ్బయ్య. సవతి తల్లి అతణ్ణి రోజూ తంతుంటుంది. తండ్రి ఎక్కడికి వెళ్ళినా తండ్రి చేయి పట్టుకొని వెళ్తుంటాడు సుబ్బయ్య. ఒకరోజు రాత్రి తండ్రి చేయిపట్టుకొని సుబ్బయ్య వెళ్తున్నప్పుడు, చీకట్లో అకస్మాత్తుగా ముగ్గురువచ్చి తనని ప్రక్కకి తోసి, తండ్రిని దూరంగా లాక్కొని పోవడం, చావబాదినట్లు వినపడటం — తండ్రి పెట్టిన చావు కేకలు — ఈలలు — పరుగులు — సుబ్బయ్యలో సహజంగా అతుక్కు పోయివున్న భయాన్ని ద్విగుణీకృతం చేశాయి. చీకటిఅంటేనే భయం సుబ్బయ్యకు. సుబ్బయ్యకు అసలు జీవితం అంటేనే భయంగా పరిణమించింది. ఆత్మన్యూనతా భావ గ్రంథి చిన్నప్పట్నుండీ సుబ్బయ్యలో పెరుగుతూ వచ్చింది. దీని ప్రభావంగా సుబ్బయ్య భావి జీవితమే మారిపోతుంది. అందరికీ సుబ్బయ్య లోకువ. భార్యముందు, ఆఫీసులో తోటి గుమాస్తాల ముందు, ఆఫీసరు ముందు — అందరికీ అతడు లోకువే. జీవితంలో ప్రతి చిన్న అంశమూ సుబ్బయ్యకు ఒక పెద్ద సమస్యే. ఏపనీ చేయడానికి ముందుకు రాలేడు. భార్య ఇతణ్ణి పిరికిపంద క్రింద జమకడుతుంది. ఆఫీసు ఇతనికి 'ఇనెఫిషియన్టు' అనే రిమార్కు ఇస్తుంది. సుబ్బయ్యే తన్ను తాను చచ్చుదద్దమ్మనుకుంటాడు.

బాగా బతికి చెడ్డ కుటుంబంనుండి వచ్చిన బావమరిది వెంకట్రావును చూస్తే సుబ్బయ్యకు గౌరవంతో కూడికొన్న భయం. వెంకట్రావ్ ఎప్పుడూ బావను సంగిరి పింగిరిగాడు అని అంటుంటాడు. ఇటువంటి వెంకట్రావు ఒకరోజు సుబ్బయ్య వద్దకు

వచ్చి, గవరయ్య (కంట్రాక్టరు) నుండి ఐదువందలు లంచం అడిగి తీసికొని తనకిస్తూ వుంటాడు. పబ్లిక్ వర్క్సు శాఖలో గుమాస్తా గిరీ వెలగబెట్టున్న సుబ్బయ్య చేతిలో గవరయ్య బిల్లులన్నీ వున్నాయి. ఈ సంగతి వెంకట్రావుకు తెలుసు. కనుకనే గవరయ్యని లంచం అడగమని సుబ్బయ్యని పురమాయిస్తున్నాడు. సుబ్బయ్యకు లంచం అడగటం ఇష్టంలేదు; ఆ విషయం వెంకట్రావుతో చెప్పలేడు. తనకు డబ్బు అవసరం. అడగక తప్పదు అని చెప్పి వెంకట్రావు వెళ్లిపోతాడు. ఎలాగో మనస్సు కూడ గట్టుకొని సుబ్బయ్య గవరయ్యని లంచం అడుగుతాడు. సుబ్బయ్య చేతికి డబ్బు అందీ అందగానే వెంకట్రావు హస్తగతమౌతుంది.

ఆఫీసులో లంచం తీసుకోవడం పసిగట్టిన మేనేజరు సుబ్బయ్యను నానాచీవాట్లు పెట్టి అతణ్ణి ఆ సీటునుండి మార్చేస్తాడు. తన పని పూర్తవక ముందే సీటుమారిన సుబ్బయ్యను తన డబ్బు వెంటనే తిరిగి ఇచ్చివేయమంటాడు గవరయ్య. వెంకట్రావు ఖాళీచేయి చూపిస్తాడు సుబ్బయ్యకు. డబ్బివ్వక పోతే అంతం చూస్తానని చేయెత్తుతాడు గవరయ్య. వెంకట్రావు మోసానికీ, గవరయ్య బెదరింపులకు మధ్య విలవిల్లాడిపోతాడు సుబ్బయ్య. పైగా డబ్బు ఎగవెయ్యమని తనకు వెంకట్రావు సలహా చెప్పడంతో సుబ్బయ్య, వెంకట్రావు మోసం కంటె గవరయ్య చావుదెబ్బలు (అప్పటికింకా పడలేదు) ముందుగానే వూహించుకొని భయపడిపోతాడు. తనమీద సానుభూతి చూపిన వాళ్ళందరికీ తన విషమ పరిస్థితి వివరించుకుంటాడు సుబ్బయ్య. మాటలతో అందరూ సుబ్బయ్యకు భరోసా ఇస్తారు. మనోరమ (ఉపాధ్యాయురాలు) మాత్రం హృదయపూర్వకంగా సుబ్బయ్యకు [illegible] చేస్తుంది. మనోరమను పరిచయం చేసుకున్న సుబ్బయ్యకు మనః క్లేశం కొంత తగ్గుతుంది. గవరయ్య మనుషులు బలవంతంగా -తన్నకపోయినా తన్నినంత పనిచేసి— వెయ్యి రూపాయల ప్రోనోటుమీద సంతకం చేయించుకుని సుబ్బయ్యను వదిలేస్తారు. మనోరమ గవరయ్య తనకు తెలుసునని, అతడికి నచ్చచెప్పి నోటు తిరిగి తెప్పించి యిస్తానని, సుబ్బయ్యకు ధైర్యం చెబుతుంది. ఆపదను తట్టుకునే విశ్వాసాన్ని ఆమె అతడికి కల్గిస్తుంది. సుబ్బయ్య కిచ్చినమాట మనోరమ నిలబెట్టుకుంటుంది. మనోరమకు కృతజ్ఞత తెలుపుకోవాలి అనుకొని సుబ్బయ్య ఆమెను కల్సుకోవడానికి బీచికి బయల్దేరుతాడు. త్రోవలో మనోరమను గూర్చిన సందేహాలను పునశ్చరణ చేసుకుంటాడు సుబ్బయ్య. తనను ఆమె అంతటి ఆపదనుండి కాపాడినా, అతడిలో సహజంగా వుండే బలహీనత ఆమెను గూర్చిన అనుమానాలను అతడిలో లేపుతుంది. అనుమానాలలో నిత్యం మ్రగ్గిపోయే అతనికి గడచినజీవితం నీచంగా, క్షుద్రంగా, గోప్యంగా కనబడుతుంది. ఆత్మ విమర్శనం అతడిలో చోటు చేసుకుంటుంది. తన చీకటి జీవితంలో మనోరమ ఒక వెలుగు; తన సముద్రం వంటి జీవితంలో మనోరమ ఒక చుక్కాని; — అనుకొంటాడు. సుబ్బయ్య జీవితాన్ని సముద్రంలాగా చూస్తాడు. కెరటాలు అనంతం. సముద్ర దృశ్యం ఒకప్పుడు భీకరం, మరొకప్పుడు మనోహరం. సము

ద్రాన్ని చూచి వెనుదిరిగి పారిపోకుండా ధైర్యంగా నిలబడతాడు సుబ్బయ్య. మనిషికి జీవితంలో కావాల్సింది ఈ ధైర్యమే.

నవల్లో వెంకట్రావు, గవరయ్యల పాత్రల్లోకూడ ఒక క్రమ పరిణామాన్ని చూస్తాం. సుబ్బయ్య బావమరిది వెంకట్రావుది జమీందార్ల కుటుంబం. చిన్నతనంలోనే తండ్రిని పోగొట్టుకొన్న వెంకట్రావు మేనమామ సాయాన్ని అర్థించాడు తండ్రితోపాటు ఆస్తి పోవడం గుర్తించే లౌకికజ్ఞానం వెంకట్రావుకి తెలిసి వచ్చేటప్పటికి మేనమామ మోసం అర్థమైంది. మేనమామ, ఇంటి గుమాస్తా, లాలూచీపడి తనను ఏకాకిగా చేయడంతో వెంకట్రావు నడిరోడ్డుపై బికారిగా నిలుచోవలసివస్తుంది. దారిద్ర్యం, దాన్నుండి దుఃఖం, దానిమీదినుండి భయం ఒక్కసారి వెంకట్రావును కలచివేశాయి. దారిద్ర్యం వల్ల ఆకలి, ఆకలివల్ల దుఃఖం, ఆకలితోనే చచ్చిపోతానన్న భయం వెంకట్రావును పూర్తిగా మార్చివేశాయి. అతడొక మోసకారిగా మారి, లోకంపై పగ దీర్చుకోవాలి అనే మనస్తత్వంతో నిండిపోతాడు. తీసుకున్న డబ్బు తిరిగి ఇవ్వక ఎగవేత కుపక్రమిస్తాడు. పైగా తన బావను బెదిరిస్తున్న గవరయ్యను, తాను ప్రేమించుకుంటూన్న ఒకనాటి గవరయ్య భార్యను చూపించి, గుట్టు రట్టు చేస్తానన్నట్లు గవరయ్యను బెదరిస్తాడు. గడిదేరిన మోసకాడుగా వెంకట్రావు మారిపోతాడు.

కంట్రాక్టరు గవరయ్యది కూడ ఒక విచిత్రమైన పాత్ర. ఇతనికి జీవితంలో సాంఘిక పరిస్థితులు విపరీతమైన ప్రభావాన్ని చూపి ఒక మార్పును తీసుకవస్తాయి. చిన్నతనంలో గవరయ్య చాల అమాయకుడు. తల్లిచాటు బిడ్డడు. పెద్దయినా, విశ్వాస పాత్రుడుగా నమ్మకస్థుడుగా గవరయ్య అందరిచేత మన్ననలు పొందుతుంటాడు. కాని లోకం అతణ్ణి వున్నట్టుండి దగాచేస్తుంది. డబ్బూ, అధికారం చూపి తహశీల్దారు గవరయ్య భార్యను లోబరచుకొంటాడు. గవరయ్య భార్య రామాయమ్మ చేసిన ఆత్మత్యాగం, ధనాధికార భ్రష్టమయిన లోకాన్ని గురించిన వాస్తవిక జ్ఞానం గవరయ్యను పూర్తిగా మార్చివేస్తాయి. అతనిలోనున్న మార్దవం కరడు కడుతుంది. జీవితంపై ఆధిక్యాన్ని చూపాలనుకొంటాడు. లోకాన్ని జయించాలని ఒక పట్టుదల, దీక్ష అతనికి జీవితంపై ఒక కొత్త విశ్వాసాన్ని, నూతన దృక్పథాన్ని కల్గించాయి. ఆరితేరిన కంట్రాక్టరవుతాడు. ఎంత బాగా మారిపోయినా తల్లి తాలూకు గత స్మృతులు, భార్యవల్ల పొందిన అవమానం స్మృతి పథంపై చెరగని ముద్రలువేశాయి. వెంకట్రావు తనుంచుకుంటున్న రామాయమ్మను చూపించినపుడు, గుట్టు రట్టు చేస్తానని బెదరించినపుడు, సుబ్బయ్యచేత వ్రాయించుకొన్న వెయ్యి రూపాయల నోటును తిరిగి ఇచ్చివేస్తాడు. నోటును మనోరమకు ఇచ్చినా, దాని వెనుక రామాయమ్మ ప్రభావమే గవరయ్యను అలా చేజేతులా డబ్బును పోగొట్టుకొనేట్లు చేసింది.

సుబ్బయ్య, వెంకట్రావు, గవరయ్యల పాత్ర చిత్రణంలో ఒక క్రమ పరిణామం వుంది. ముగ్గురి జీవితాల్లో చిన్నప్పటి సంఘటనలు బలమైన ముద్రలువేస్తాయి. తత్ఫలితంగా వారి వారి జీవితాలు వేర్వేరుగా పరిణమిస్తాయి. వీరిమనస్తత్వం ఆత్మన్యూనతా భావగ్రంథితో సమ్మిళితమైంది. వీరు ముగ్గురూ గారాబంగా తల్లిదండ్రులచాటున పెరిగినవాళ్ళు. బయటి ప్రపంచం వీరికి భయానకం. ఆత్మన్యూనతా భావగ్రంథి ప్రతి వ్యక్తిలో కొద్దో గొప్పో పుట్టుకనుంచీ వుంటుంది. కొన్ని అసాధారణ పరిస్థితుల్లో వ్యక్తి దీనినుండి బయటపడతాడు. ఆత్మన్యూనతా భావగ్రంథి అంటే తన్ను తాను తక్కువ చేసుకుని జీవితంలో ప్రతిచిన్న సమస్యకీ చలించిపోయే మనఃప్రవృత్తి. ఇటువంటి భావగ్రంథికి లోనైన సుబ్బయ్య, వెంకట్రావు, గవరయ్యలు బాల్యదశలో ఎక్కువగా తండ్రిమీదనో, తల్లిమీదనో ఆధారపడి పెరిగిన గారాబం పిల్లలే* (Pampered children). వయసు పెరిగినకొలదీ వీరిలో బాల్యదశలో ఏర్పడిన భయం, మోహం, ముద్రలువేసిన ఆత్మన్యూనతాభావం వీరి అసాధారణ ప్రవృత్తులకు మూలమయింది. మానవపరివర్తనం బాల్యదశలో బాహ్యప్రపంచం వేసే ముద్రలాంటి ప్రభావంపైన ఆధారపడి, రూపం దిద్దుకుంటుంది. బాహ్యప్రపంచ పరిసరాలతో పాటు, కుటుంబ వాతావరణం ప్రభావంకూడా బాల్యదశ మానసిక పరిణామంపై ముద్రవేస్తుంది. భావిజీవితంలో తీవ్రతరమైన బలమైన మానసిక క్లిష్టతానుభవం ఎదురయి. చిన్నప్పుడు మనస్సుపై బలమైన ముద్రవేసిన సంఘటన స్ఫురణకువచ్చి, దాని స్వరూపాన్ని స్పష్టంగా అవగాహన చేసుకోవడంవల్ల, బాల్యదశలో ఏర్పడ్డ ఆత్మన్యూనతాభావగ్రంథి నుండి బయటపడే అవకాశం వుంటుందని అడ్లర్ మానసికశాస్త్రవేత్త సిద్ధాంతం. ** ఆత్మన్యూనతాభావగ్రంథికి లోనైన వ్యక్తి సాధారణంగా పిరికి

*'...These grown up Pampered children are perhaps the most dangerous class in our community...and if society shows hostility to their way of living they take this hostility as a new proof that they are personally illtreated... a child has never known what love and co-operation can be; he makes up an interpretation of life... when he faces the problems of life he will overrate their difficulty and underrate his own capacity to meet them...'

Adler Alfred. 'What life should mean to you'.

** 'Inferiority feelings are in some degree common to all of us, since we all find ourselves in positions which we with to improve. If we kept our courage, we shall set about ridding ourselves of these feelings by the only direct, realistic, and satisfactory means by improving the situation, No human being can bear a feeling of inferiority for long, he will be thrown into a tension which necessisates some kind of action., —Adler Alfred 'Feelings of Inferiority and Superiority'

వాపోయివుంటాడు. ఒక సమస్యను ఎదుర్కొన్నప్పుడు భయపడటం, కోపగించుకోవడం, చికాకుపడటం, ఇతరుల మీదికి బాధ్యతలను నెట్టడం, తన్ను తాను వంచించుకోవడం, ప్రస్తుతం చేయాల్సినవాటిని వెనక్కు నెట్టివేయడం, వచ్చిన నష్టాల్ని ఇతరుల పైకి నెట్టడం – ఇవన్నీ ఆత్మన్యూనతా భావగ్రంథి లక్షణాలు.

సుబ్బయ్యలో పైలక్షణాలన్నీ వున్నాయి. అందరి దగ్గరా ఒదిగిడం, నీడలను చూచి భయపడటం, అధికారం అంటే హడలెత్తటం, ఫలితంగా పిల్లిపీకలు కప్పగంతులు, కళ్ళుమూతలు. వాడేమనుకుంటాడో, ఇదేమనుకుంటుందో...కోపం వస్తుందేమో ? ఉద్యోగం ఊడుతుందేమో ? లంపటం తగులుకుంటుందేమో...అయినా ఈ గొడవ మనకెందుకు ? ఈతంటాలు మనకేల...' (అల్పజీవి. పుట-105). తన్ను చూచి అందరూ ఎగతాళి చేస్తున్నారనుకుంటాడు (పు. 10()). సమస్యలెదురైనపుడు తప్పించుకోవాలనుకొంటాడు. ఎగుటివారి చెడును కోరడానికైనా సిద్ధపడతాడుగాని, తనలోని పొరబాటును ఒప్పుకోడు. 'గవరయ్యొస్తే ఏంజేస్తాడు ? అయిదు వందలూ ఇవ్వమని అడుగుతాడు. అడగనీ పదిసార్లు. వందసార్లు, వెయ్యిసార్లు, లక్షసార్లు అడగనీ ..ఇవ్వను' (పు. 129). 'ఛా ! ఛా ! వెధవలోకం ! వెధవమనుష్యులు. ప్రళయంవచ్చి అంతా అంతమైతే బాగుండును. ...అందరికన్నా ముందు గవరయ్య చావాలి... ఈరాత్రే గవరయ్య చచ్చిపోతే ఎంతహాయిగా వుంటుంది!' (పు. 110)

మనోరమ పరిచయంతో మానసిక పరిణామం సుబ్బయ్యలో ప్రారంభమౌతుంది. గవరయ్యమనుష్యులు సుబ్బయ్యని ఎత్తుకొనిపోయి భయపెట్టి వేయిరూపాయల ప్రామిసరీ నోటుమీద సంతకం చేయిస్తారు. సుబ్బయ్య వంటిమీద ఒకదెబ్బ పడకపోయినప్పటికి చావుదెబ్బలు తింటూన్నట్లే భావించి నిలువునా వణికిపోతాడు. చిన్నతనం నుండి తనను ఆవరించిన భయం– చిన్నప్పటి సంఘటనలాంటిది భయానక పరిస్థితి జీవితంలో మరలా ఎదురయినందున– అతడిని భయం కొంత వీడిపోతుంది. భయంనుండి బయటపడటానికి సుబ్బయ్యకు పూర్తిగా ఉపకరించింది మనోరమ ఇచ్చిన ధైర్యం, ఆమెచేసిన సహాయం.

మనోరమ ప్రసాదించిన జీవితం సుబ్బయ్యకు కొత్తగా చైతన్యవంతంగా కనబడుతుంది. నీతి, సంప్రదాయం, సమాజం – వాటి పరిధులు నీలితెరలుగా సుబ్బయ్యకు కనబడతాయి. ప్రక్కకు నెట్టితే ఒత్తిగిలేవిగా వుంటాయి. సంచలనాత్మక జీవితాన్ని గుండె నిబ్బరంతో ఎదుర్కొని సముద్రం వంటి జీవితాన్ని మనోహరమయినదాన్నిగా స్వీకరిస్తాడు సుబ్బయ్య. అలల్లాంటి సమస్యలను తట్టుకొని నిలబడాలంటే ధైర్యంఉండాలి. ధైర్యంఉండాలి అంటే గుండెనిబ్బరం ఎంతోకావాలి. సత్యసంధత ఆత్మ విమర్శనాజ్ఞానం వుంటేగాని గుండెనిబ్బరం కలగదు. ఆత్మ విమర్శనాజ్ఞానం పెంపొందించుకుని గుండె నిబ్బరంతో జీవిత సముద్రాన్ని దాటడమే అల్పజీవి నవల సాధించిన జీవితతత్వం.

(తరువాయి 11 పేజీ లో)

# 'మూడు ఖండకావ్యాలు'-ఒక అభిప్రాయం

- కె. వి. రామారావు, ఎం. ఏ., లెక్చరర్, రాజమండ్రి.

---

డిసెంబరు 16 వ తేదీ 'సమాలోచన' లో ప్రచురితమైన శ్రీ జమదగ్ని గారి తులనాత్మక పరిశీలనను "మూడు ఖండకావ్యాలు" చదివిన తరువాత కలిగిన ఆలోచనలు ఇచట పొందుపరుస్తున్నాను.

చర్చింపబడిన ఖండకావ్యములు — కరుణశ్రీ 'పుష్ప విలాపము', వేగులవారి 'కాంతి' మరియు సుల్లావధాని గారి 'పుష్ప వివేకము'. భాష, శిల్పము స్పృశింపబడినా పరిశీలన ఎక్కువ భాగము పద్యముల అర్థమును, కవియొక్క ఉద్దేశములను దృష్టిలో నుంచుకొని చేయబడినది. 'పుష్ప వివేకం' లోని మొత్తం పన్నాలుగు పద్యాలు ఉద్ధృతములు(quotations)గా నీయబడినవి. ఈ ఖండకావ్యమును ప్రవేశపెడుతూ వ్యాసకర్త వ్రాసిన మాటలు; "ఇందులోనూ సరిగ్గా పద్నాలుగు పద్యాలు ఉన్నాయి. నూటికి నూరుపాళ్ళు వివేకంతో, ప్రత్యక్ష రాచిత్యంతో, స్వచ్ఛ సంప్రదాయ పావిత్ర్యంతో, వెలువడిన రచన ఇది." అది పొందవలసిన జనాదరణ పొందలేదనే ఆయన ఆవేదన; అందువల్ల ఈ ఖండకావ్యం మీద ఉండే మక్కువను చెప్పక చెప్పుచున్నవి. వ్యాసం మొత్తంలో మనకు కనిపించేది 'పుష్ప విలాపా' నికి 'పుష్ప వివేకా'నికి మధ్య ఒక రకమైన ప్రతిద్వంద్విత్వము. 'కాంతి' ఊరికే ప్రసంగ వశమున పేర్కొనబడింది. అయితే, -అది వేరొక పనికూడా సాధించింది. "ఆ 'కాంతి' తన కాంతిను సమగ్రంగా సాధించుకుంది" అని వాచ్యంగా చెప్పడంవల్ల అంతక్రితమే చర్చించబడిన 'పుష్ప విలాపం' తన ధ్యేయంలో సఫలీకృతం కాలేదని ధ్వని. వినే వారి గుండెను స్పృశించడమే కదా విలాపం యొక్క పని!

"పాపం పూలదేమున్నది? అవి నోరూ వాయీ లేనివి. వ్రాసేవారి చిత్తాన్ని బట్టి ఏమనమంటే అదే అంటాయి," అన్నారు వ్యాసకర్త. ఇది ఎంతయో నిజము. ఇంకొక్కడుగు ముందుకు వేస్తే అసలు అంటున్నది పుష్పములు కావని, కవి యని; అంటున్నది ఒక ఉద్దేశ్యమును దృష్టిలో పెట్టుకొని అనీ; అవగతం కాకపోదు. పుష్ప విలాపము'ను గూర్చిన చర్చ యంతటిలోనూ శ్రీ జమదగ్ని గారు పూలను గురించియే ఎక్కువగ చెప్పినారు. ఈ రచనలో కవి సాధించదలచిన ప్రయోజన మేమి టని ప్రశ్నించి "సర్వగత జీవ భావ ప్రబోధమే కవి ఆశయ"మని తీర్మానించినారు. దాన్ని కలిగించడంలో ఆయన కృతకృత్యుడయ్యా డని, అందు కాయన బహుధా అభినందనీయుడనీ కూడా అన్నారు.

తరువాత ఇది చూపుల గుత్తమే అని తేల్చారు. "శిల్ప మెంత సుందరంగా ఉన్నా అది శివేతరాన్ని పరిహరించేది కావాలి. అమంగళాపాది కాగూడదు. అప్పుడే

అది సాహిత్య మవుతుం" దని తీర్మానించి; కరుణశ్రీ కావ్యంలోని దోష పరిశీలనకు పూనుకున్నారు. "ఇది బౌద్ధ ధర్మ ప్రభావంతో వెలువడిన రచన. ఈ విషయాన్ని కవి బాహాటంగానే అంగీకరిస్తున్నాడు. ఆ బౌద్ధ ధర్మం పరమార్థం కానందువల్లనే నిలువలేక పోయింది. ఇలా జీవభావాన్ని సర్వగతంగా అంగీకరించి హింస ఏ కొంచెమూ పనికిరా దనే బౌద్ధుకు బ్రతకడానికే వీలులేదు." అంటారు జమదగ్ని గారు.

ఇది బౌద్ధ ధర్మ ప్రభావంతో వెలువడిన రచన యని వ్యాసకర్త ఎలా అభిప్రాయ పడ్డారో తెలియకుండా ఉంది.

"బుద్ధదేవుని భూమిలో పుట్టినావు
సహజ మగు ప్రేమనీలోన చచ్చె నేమి?"

అనే రెండుపంక్తులుతప్ప కావ్యంలో ఎక్కడా బుద్ధుని ప్రసక్తి గాని బౌద్ధధర్మ ప్రసక్తి గాని లేవు. ఈ రెండుపంక్తులలోకూడా మానవసహజమగు 'ప్రేమ'ను గురించి ప్రశ్నిస్తూ, బుద్ధుడు జన్మించిన పవిత్ర భారత భూమిలో పుట్టినవాడా! ఈ ప్రేమ నీలో ఇంకా ఎక్కువ ఉండాలోయి, అలాటిది పూర్తిగా చచ్చిపోయిందా అని కవి అడుగుతున్నాడు. 'మైలపడిపోయె నోయి నీ మనుజజన్మ' అన్న ఆఖరి పంక్తి ఈ అర్థమునే బలపరుస్తుంది. ఇంక 'ఇది బౌద్ధ ధర్మ ప్రభావంతో వెలువడిన రచన' అని కవి బాహాటంగా ఎక్కడ అంగీకరించాడు? మిత్రులతో చర్చలలోనా? బుద్ధుడంటే కవికి ఆరాధన ఉండవచ్చు, అటులనే క్రీస్తు అన్నా, గాంధీ అన్నాకూడా ఉంది — 'అంధకార బంధురమైన ప్రపంచంలో అహింసాజ్యోతి వెల్గించిన అమరమూర్తు లీముగ్గురూ. అఖండమైన త్యాగంతో, అచంచలమైన కర్తవ్యదీక్షతో, అనన్య సామాన్యమైన ఆత్మార్పణంతో విశ్వాన్ని పులకింపచేసిన త్రిమూర్తులు వీరు,' అంటారు కవి తన 'కరుణశ్రీ' ఖండకావ్య నివేదనములో!

చేతులారంగ నిన్ను పూజించు కొరకు
కోడి కాయంగనే మేలుకొంటి నేను;
గంగలో మున్గి ధౌత వల్కలము గట్టి
పూలు గొనితేర నరిగితి పుష్పవనికి

అంటూ ప్రారంభమయిన ఈ కావ్యం ఆర్ష ధర్మము ప్రాతిపదికగా గలదియే. వైవిధ్యం గల భారతీయ ధర్మం మోక్షసాధనకు భక్తి, జ్ఞాన, కర్మ మార్గాల నుపదేశించింది. చిత్తశుద్ధి లేని శివపూజ ఆమోదయోగ్యం కాదు అన్నది ఇరవయ్యో శతాబ్దిలోని సామాన్య మానవున కామోదయోగ్యమయిన సిద్ధాంతం. "హృదయమే లేని నీ పూజ లెందుకోయి?" అన్న ప్రశ్న, బండబారెనటోయి నీ గుండెకాయ? శివునికై పూయకే నాల్గు చిన్నపూలు? అన్న ప్రశ్నయు, టాగూరు మొదలైన ప్రసిద్ధ ఆధునిక భారతీయు లెందరో అడిగారు. భావుకులైన మానవతావాదు లందరూ అడిగే ఎన్నో

ప్రశ్నలు పుష్ప విలాప కావ్యంలో ఉన్నాయి. ఈ కావ్యం మానవతావాద ప్రతిపాదకము గాని బౌద్ధ ధర్మ ప్రతిపాదకము కాదు.

'ఆ బౌద్ధ ధర్మం పరమార్థం కానందువల్లే నిలువలేకపోయింది' అన్నది వ్యాసకర్త మరో అభిప్రాయం. జపాను, ఇండోనేషియా, థాయిలాండు, మొదలైన దేశాల్లో బౌద్ధ ధర్మం ఇప్పటికీ—సుమారు రెండువేల సంవత్సరాల తర్వాత కూడా—నూతన పువ్వులుగా, ఆరు కాయలుగా విలసిల్లుతోంది. మన దేశంలో అది బలహీన మవడానికి కారణం దానిలోని లోపాలు కావు. హైందవ ధర్మం యొక్క వైశాల్యము, సర్దుబాటు ధోరణీ కారణాలు. హిందూధర్మం మిగిలిన ధర్మాలన్నిటినీ తనలో ఇముడ్చుకోగలిగిన శక్తి గల్గినట్టిది. అందుచేతనే దశావతారాల్లో బుద్ధుడికి కూడా చోటు దొరికింది.

'ఇలా జీవభావాన్ని సర్వగతంగా అంగీకరించి హింస ఏ కొంచెమూ పనికిరాదనే బౌద్ధుడు బ్రతకడానికే వీలులేదు,' అని వ్యాసకర్త తీర్పు. జీవభావాన్ని సర్వగతంగా అంగీకరించటం వరకు చాలామంది ఏకాభిప్రాయులే. రష్యాలో శాస్త్రజ్ఞులు మొక్కలుకూడా ప్రేమతో కూడిన లాలనకు, క్రౌర్యంతో కూడిన రౌష్ట్యానికి, ఎంత భిన్నంగా ప్రతిక్రియలు చూపిస్తాయో నిరూపించారు. వాటి ప్రవర్తనకూడా పెంపుడు జంతువుల, చిన్నపిల్లల ప్రవర్తన వలెనే ఉన్నది. ఏది హింస, ఏది అహింస అనే ప్రశ్న ఉదయించినప్పుడు భిన్నవర్గాలవారు భిన్న ప్రకృతులవారు భిన్నమైన సమాధానాలు ఇస్తారు. గాలిలోనూ, నీటిలోనూ సూక్ష్మజీవులుంటాయని శ్వాసించటం, నీరు త్రాగటం మానివేయ గలమా? 'పుష్ప విలాపం' కావ్యం వ్రాసిన తర్వాత కరుణశ్రీ పూలు కోయలేదనికాని, పూలదండలు ధరించలేదనికాని, వారింట్లో ఆడవారిని పూలు ధరించటం విషయమై నిషేధం విధించారని కాని అనుకోవటం హాస్యాస్పదం అవుతుంది.

'జీవత్వ ద్యోతనానికై ఆరోపించిన మనుజత్వం వల్ల ఎన్నో అనర్థోపదేశాలు తటస్థపడుతున్నా' యని శ్రీ జమదగ్ని గారు అభిప్రాయపడ్డారు. ఈ అభిప్రాయముతో కొన్ని పద్యాలను పరిశీలించి ధర్మాధర్మాల చర్చ చేశారు. 'పుట్టినదగ్గరనుంచి పోయే క్షణం వరకు తల్లి ఒడిలోనే ఉండాలనుకోవడం కేవలం మోహంతో కూడిన మూర్ఖత. జీవితం క్షణికమని తెలిసి అందులో స్వార్థమే పరమార్థమనుకోవడం మానవత్వం కా'దని, 'ఒక్కొక్కప్పుడు ధర్మం కోసం దయను విడచిపెట్టవలసి వస్తుందని', వాక్రుచ్చారు. బౌద్ధం, అహింస ఈ 'పుష్ప విలాపా'నికి ప్రాతిపదిక లనుకోవడం వల్ల ఈ అనర్థోపదేశాలన్నీ వచ్చాయి. 'ఆయువు గల్గు నాల్గు గడియల్ కని పెంచిన తీవతల్లి జాతీయత దిద్దితీర్తుము' అనటంలో ఎంతో ఆత్మగౌరవం, దేశభక్తి, జాతీయ భావన, ఇమిడిఉన్నాయి. గాలికి సుగంధమును, తేనెటీగలకు తేనెను, రసపిపాసి నేత్రాలకు సౌందర్యానుభూతిని ఇచ్చే విరికన్నియలు స్వార్థజీవులెలా అవుతాయి?

ఒక మనిషి కోసుకుపోతే ఇన్ని పనులు సాధ్యపడతాయా? ఇది విస్తృతార్థంలో నిస్వార్థ సేవకాదా? పువ్వు ఉండేది ఒకరోజు. ఉన్నకాసేపూ స్వతంత్రంగా బ్రదికి, స్వచ్ఛందంగా సేవచేసి, స్వతంత్రంగా చావాలనుకోవడం అధర్మమా?

జాగ్రత్తగా ఆలోచిస్తే 'పుష్ప విలాపం' కేవలం పువ్వులయొక్క వీడ్పుగా కాక రక్షణలేని ఎందరో ముగ్ధ సుకుమార – 'పూబోడుల విలాపంలా, ఈ ప్రపంచంలోని ఎందరో కష్టజీవుల (the exploited masses of the world) యొక్క ఆక్రందనంలా అనిపిస్తుంది. పూవులలో మనుజత్వ ఆరోపణ వలన చేకూరిన ప్రయోజన మిది. పూలు, స్త్రీలు చాలాచోట్ల పర్యాయపదాలుగా వాడబడుట జగద్విదితమే కదా.

'ఉదయశ్రీ' రెండవ భాగంలో 'పాకీపిల్ల' ఇలా ప్రారంభ మవుతుంది :–

'తన సుఖము వీడి తోడి సోదరుల సౌఖ్య
మునకె జీవిత సర్వస్వమును వ్యయించి,
ఏవ మెరుగని నీ యమాయికపు ప్రేమ
లో తెరుగ జాలదీ స్వార్థ లుబ్ధ జగతి'.

ఈ ఖండికలోని పద్యములన్నీ పుష్ప విలాపాన్ని స్మరణకు తేకపోవు. రెండింటిలోనూ దోపిడీ సూచింపబడింది. వీటిలో నున్నది 'మానవతా వాద' సిద్ధాంతము (Humanism). ఇది సాహిత్యానికి, మానవజాతికి ఇరవయ్యవ శతాబ్దపు కానుక. మానవ సమాజంలో ఉన్న బానిసతనాన్ని, దోపిడీని అంతం చెయ్యడం చేతకాకపోతే కనీసం సానుభూతిని ప్రకటించడం తోటి మానవుడుగా నీ విధి — ఇది ఈ కావ్యాల సందేశం. 'పుష్ప విలాపం' పాఠకులలోని భావుకతని మేల్కొల్పుతూ, హృదయ మార్దవాన్ని పెంపొందిస్తుంది కాని నువ్వు పువ్వులు కోయకూడదని నిషేధించదు.

ఈ విధంగా, అత్యంత సుందరమైన శిల్పంతో; జాతీయము, మకరంద సదృశము నైన తేట తెలుగు నుడికారంతో; కరుణ రస భరితమై మానవ సమాజాన్ని ఒక మెట్టు పైకి తీసుకొని పోగల్గిన ఆధునిక మహాకావ్యం 'పుష్ప విలాపా'న్ని శ్రీ జమదగ్ని గారు 'అమంగళాపాది' అనడం సమర్థనీయం కాదు.

శ్రీ గరికపాటి మల్లావధానిగారి 'పుష్ప వివేకము'ను గూర్చి చెబుతూ, "ఇది నిజంగా బహుళ ప్రచారం పొందవలసిన చక్కని ఖండకావ్యం. అయినా ఆధునిక లోకంలో వివేకాని కంత ప్రాముఖ్యం లేనందువల్లా, ఇది వెనుకటి వాటికి ప్రతిక్రియగా వెలువడిందన్న జన్మదోషం ఉన్నందువల్లా పొందవలసిన ప్రచారాన్ని పొందలేదు, అని శ్రీ జమదగ్ని గారన్నారు.

"నిరుప మానందకర కళా నిలయ మూర్తి !
సహజ సౌజన్య సామ్రాజ్య చక్రవర్తి !
ఆర్ద్ర భావాత్త సుకృత సథానువర్తి !
నమ్మరా కొమ్మిశెట్టి స్వామి నీవు !"

ఈ పద్యం ఏ జన్మమానాద్యుల్లో కెళ్ళైన చక్రవర్తి శ్రీనివాసుని గూర్చి వ్రాసినదంటే నవ్వేలా ఉంది. సామాన్యులైన మానవుడి గొప్ప తనంలను పొగడనా? దీనికి కావ్య వస్తువు కాగలదా? 'Poetry is the spontaneous overflow of powerful emotions' అన్న 'వర్డ్స్‌వర్త్' యొక్క కావ్య నిర్వచనాన్ని మనం అంగీకరించకపోయినా హృదయాన్ని స్పృశించలేని కవిత ఎంతో కాలం మనలేదని పెద్ద లంటుంటారు. సాటివారికి వివేకం పంచి ఇవ్వాలికదా అని ఆలోచించి వ్రాసిన పద్యాల్లో సహజత్వం చాలావరకు కుంటుపడుతుంది. ఆలోచనకే ప్రాధాన్యం వస్తుంది కాని భావానికి కాదు. భాషాపటిమ ఎక్కువై భావపటిమ సన్నబడిన కావ్యం బహుళ ప్రచారాన్ని పొందలేదు.

'పుష్ప విలాప'నికి అపార ప్రచారం కల్పించిన ఘంటసాల ఇప్పుడు లేరు, అంటారు శ్రీ జమదగ్ని గారు. లతామంగేష్కరో, సుబ్బులక్ష్మో, ఘంటసాలో పాడడం వల్లనే భగవద్గీత అంత ప్రచారం పొందిందా? ఒక కావ్యం లోకప్రియం కావాలంటే కవియొక్క ప్రతిభతో పాటు సమాజస్థితికూడా దోహదం చెయ్యాలి. అనేకానేక కారణాలవల్ల సమాజ చేతనలో ఒక్కొక్క దశాబ్దం గడిచేసరికి కొంత మార్పు వస్తుంది. సమాజచేతనని సరిగా అవగాహన చేసుకున్న కవి ఆ కాలమునకు తగిన సుందర కావ్యాల్ని సృష్టిస్తాడు. అవి ఆ కాలాన్ని ఒక ఊపు ఊపడమే కాక శాశ్వతంగా మానవజాతి అమూల్య సంపదలుగా నిలిచిపోతాయి.

···౬♦౬···

---

( 6 వ పేజీ తరువాయి )

అధస్సూచికలు :


1. Adler Alfred : What Life should Mean to you.
2. ,, : The Practice and theory of Individual-Psychology.
3. ,, : Problems of neurosis.
4. ,, : The Individual Psychology.
5. Floyd, L. Ruch : Psycholcgy and Life
8. సుదర్శనం ఆర్.యస్. : సాహిత్యంలో దృక్పథాలు.


—౬—

# కళాప్రపూర్ణ శ్రీ శివశంకరస్వామి

- యస్. రాజశేఖర్ (రత్నశ్రీ) బి. ఏ.

ప్రాచీనార్వాచీన సాహిత్యామృతాన్ని పుక్కిటబట్టిన రసశిల్పి శ్రీ తల్లావఝ్ఝుల శివశంకరస్వామి. (శాస్త్రి.) సహృదయులకు తమ సాహితీ సందేశాన్ని సర్వత్రా రసస్పందనంగా అందించిన వీరికృషి అక్షరప్రాయమైనదే కాక, విలక్షణమైనది. ఆయన రసవైదుష్యం సహృదయుల హృదయాల్లోంచి జాలువారి సార్వజనీనత నొందినది.

వీరు భావకవిత్వానికి నాంది పలికారు. ఆయన ప్రభావం పలువురు కవులపై ఉంది. ఆయన సాంప్రదాయిక, ఆధునిక కవిత్వాల మధ్య వారధి. ఆయన హృది కవితానీరధి. ఆయనమది సుధాంబుధి. ఆయన కవిత్వంలో నిత్యనూతనత్వం, దివ్యచేతనత్వం ఉన్నాయి. ఆయన మహాకవి, ప్రభారవి. ఆయన ఉద్దండ పాండితీమండితుడు. ఆయన వ్యక్తిత్వం చక్కనిది. ఆయన కవిత్వం చిక్కనిది. ఆయనొక విశిష్టశైలిని స్థాపించుకొని వచనకవితకు (గేయాలకు) పరిపుష్టమైన స్థానాన్ని కల్పించారు.ఆయన శిల్పపుహారువు సౌందర్య కల్పతరువు.

విద్యావాచస్పతి, కవిసార్వభౌమ, మహోపాధ్యాయ, సాహిత్యాచార్య, సాహిత్యసమ్రాట్, కవీంద్ర, కళాప్రపూర్ణ, మొదలైన బిరుదులుపొందిన శ్రీశివశంకరస్వామి చేసిన సాహితీసేవ ఎన్నదగినది. ఆయన ప్రతిభ, పాండితీప్రకర్ష, వైదుష్యం, బహుభాషాప్రవేశము, అభినివేశము యావన్మందికీ సుపరిచితాలు. ఈ సువిశాల సుందర విశ్వంభరాలయంలో స్వశక్తిచేత, స్వయంసహాయంచేత, స్వప్రతిభాధౌరంధర్యంచేత, ఉత్తమోత్తమస్థానాన్ని పొందిన వ్యక్తులు అరుదు. అటువంటి వారిలో శ్రీశివశంకరస్వామి ఒకరు. సంప్రదాయ సృష్టికీ, ఆశామయదృష్టికీ, చారిత్రిక చింతనకు ఆయన మన స్మరింపచారు. ఆయన కవితాశైలి సుమనోహరమై, సుందరమై బాలబాలికల హృదయక్షేత్రాలనుకూడా పులకింపచేయు, సులలిత పదజాల సందోహయుతమై, సుపరిమళ భరితమై రొుప్పారుచున్నది. కవిత్వం ఆపాతమధురమేకాదు. ఆలోచనామృతంకూడ.

వీరిసంగీత రూపకమైన "పద్మావతీచరణచారణ చక్రవర్తి" వీనులవిందై, అమృతపుసోనలపొందై, అమందసుమధుర గానము క్రందై విలసిల్లిన దని అనటంలో సందేహం లేదు. కథాకథనంలో వీరవలంబించిన నాటకీయపద్ధతి అతినిపుణముగా నిర్వహించబడినది. వీరు వ్రాసిన వకుళమాలిక గీతికాలతిక. ఇది మృదు మధురకవితాలాపనమై, గానాలాపనమై, ప్రసన్న భావమనోహర పరిమళాన్ని గుప్పుచున్నది. ఈయన రచ

నలు పరిశీలిస్తే ఈయన ఋషి తుల్యుల కోవలోవారే అని స్పష్టమౌతుంది. సృజనాత్మకంగా ఆలోచించే మేధోపజీవులకోవకే, ఆలోచనల్ని కదిలించే సాహిత్య స్రష్టల శ్రేణికీ, నవనవోన్మేష సహృదయ విపశ్చితుల సంప్రదాయానికీ చెందిన శ్రీ స్వామి గారు, మనస్సును మథించి, హృదయాన్ని శోధించి, ఆలోచననీ, అనుభూతినీ రంగరించి తాత్త్విక దృక్పథంతో రచించిన, రచనలు కూడా ఉన్నాయి.

శ్రీ శివశంకరశాస్త్రి (స్వామి) గారు ప్రాచీన, నవీన ప్రగతివాదాల త్రివేణీ సంగమం. స్పర్శవేదివంటి ఆయన మృదువైనహస్తం ఏసారస్వతశాఖపై పడినా, అది సువర్ణమయ మయింది. గేయం, నాటిక, సంగీతరూపకం, వీరి ప్రత్యేకముద్రతో నవ జీవనాన్ని సంపాదించుకొన్నాయి. వీరు లబ్ధ ప్రతిష్ఠులు. అనేకానేక కావ్య ప్రణేతలు. ఆంధ్రసంస్కృతి ప్రభావాలభావాలు రచనలోని రాగవీణ పలికించాయి. హృదయానికి అనుభూతి, స్పందన లిచ్చే వారి ఖండికలకూర్పు 'శివశంకర కృతులు'. సర్వత్రా ప్రాచీనతను పట్టంకట్టే వీరి వ్యక్తిత్వం,ఛందస్సులో అందంగా వినిపించటం మరింత మాధుర్యధుర్యంగా ఉంది. రసరమ్యములైన వచనగీతికలను, హృద్యమైన పద్యములను, భావాల్ని హయంలాగా పరిగెత్తించిన గేయాల్ని, నవ్యమైన, దివ్యమైన శ్రావ్యమైన, సంసేవ్యమైన కావ్యాలను; సుమధురపద ఝురీతరంగాలైన నాటికలను; అందించిన సాహితీతపస్వి 'శ్రీ శాస్త్రి' గారు. అలతిపదములతో అనల్పమైన అర్థాన్ని అందించడంలో ఆయన గొప్పదనం ద్యోతకమౌతుంది. ఆయన చేతిలో ఏవస్తువులైనా రమణీయంగా చిత్రీకరించబడుతాయి. ఎట్టి పాషాణమైనా మెప్పించగలశక్తి ఆయనకుంది. అనర్గళమైన కవితాశక్తి, అవిరళమైన ఆంధ్రభక్తి, అసమానమైన కావ్య కళానురక్తి, గల వీరి మమతల మనసునుండి మరిన్ని 'మధురకావ్యా లుల్లంపల్లవించేలా, తళుకులొత్తాలని ఆయన రచనలు పఠించిన ప్రతిపాఠకుడు పలుమారు భావిస్తాడు. వీరు అలాంటి రసస్పందనం అందించడంలో కృతకృత్యులయ్యారు. వీరు ఆంధ్రభాషా యోషకు ఆభరణములనదగు అనేక రచనలుచేసి, సాహితీలోకంలో ఒకవిశిష్టస్థానాన్ని సంపాదించుకున్నారు.

వీరు అనేక, పత్రికలను నడిపి, అనేక కవులను ప్రోత్సహించి ఆంధ్ర సాహిత్యానికి ఎంతో సేవ చేసారు. కవిత్వమందలి పటుత్వమును, భావములయందలి గాంభీర్యమును, శైలియందలి సంపదను చవిగొనవలెనని అభిలషించు సారస్వతాభిమానులు వీరికృతులన్నీ చదవాలి. ఆయనది అపూర్వసృష్టి, అమృతవృష్టి - నవ్య కవిత్వంలో శాస్త్రిగారిస్థానం అద్వితీయం. ఆయనను గురించి చెప్పాలంటే ఆయనొక సాహితీ విరించి. అతివిశాలగభీరపయోధియై విశ్వఫాలాక్షుడైనట్టి, శ్రీ శివుని గురించి ఎంత చెప్పినా తక్కువే అవుతుంది. వీరికవితలో కవితాసౌరభం వెల్లివిరిసింది. అమృతం జల్లు కురిసింది. అందం అరవిందమై విరిసి, మరందనిష్యందాన్ని సుగంధప్రబంధాన్ని

పంచింది. కవితాసౌందర్యం హరివిల్లై మెరసి, ఆనందం విరిజల్లయి కురిసింది. ఆయన మంచి భావుకుడు, మంచిభాషాసంపన్నుడు. కవిత్వంలో ఒకవొడుపు, ఊపు, ఉన్నాయి. ఆయనద్రష్ట, ఆయనస్రష్ట, బ్రతుకునకు పరాకాష్ఠ. శంకరశాస్త్రి మేటి కవితామేస్త్రి. ఆయన హృదయం సుహృద్భావాల నిలయం. ఆయనవదనం చిరునవ్వుల సదనం. సత్కవిత్వం వ్రాయడమే ఆయనవృత్తి. నవకవులకు ప్రోత్సాహమివ్వడమే ఆయన ప్రవృత్తి.

అనేక సాహితీవేత్తలు ఆయన ప్రతిభను శ్లాఘించారు. కవిత్వాన్ని ప్రశంసించారు. వ్యక్తిత్వాన్ని వేయినోళ్ళ స్తుతించారు. ఆయనను గురించి ఒక్క మాటలో చెప్పాలంటే, బహుభాషావేత్త, కళాతపస్వి, కవిత్వానికి పర్యాయపదం, నవత్వానికి మరోరూపం.

ఆయన కవిత్వాన్ని, వ్యక్తిత్వాన్ని అనేకులు సాహితీవేత్తలు ప్రస్తుతించారు. వారిమాటల్లో ఆయన ఘనత వివరించడం సమంజస మని భావిస్తున్నాను. ముందు ప్రముఖ భావకవి, ఆయన ఆశీస్సులు అందుకొని వెలుగొందిన శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి అభిప్రాయం చిత్తగించండి. “స్వామి శివశంకరశాస్త్రులు తమగ్రంథాల ద్వారానేకాక, సాహితీసమితి ద్వారాకూడా నవ్యకవిత్వానికి గొప్పపటిమ ఇచ్చారు. వీరు మహావ్యక్తి. వీరే ఒకసంస్థ. ఎన్నిభాషలలో వీరెరుగుదురు. ఎన్ని సాహిత్యహృదయపులోతులలో తరచి చూశారు. కాని సంస్కృత వాఙ్మయమంటే మోజు ఎక్కువ. వీరి హృదయము ఎంత ఆర్ద్రమూ, అకలంకమూ, కాకపోతే, వీరి ప్రతిభ ఎంత గాఢమూ, నిశితమూ, కాకపోతే చిత్రచిత్ర ప్రకృతులుగల కవుల నందరిని ఒక్క కూటంలో అంతకాలం కూర్చి ఉంచగలరు ? వీరి కవితాప్రాభవాన్ని వివరిస్తూ ఇలా అంటారు ‘వీరి అనుభవాలు క్రొత్తవి, కావ్యరూపాలు క్రొత్తవి, వీరు పద్యరూపకాలు వ్రాయడంలో మార్గదర్శి.’

వైతాళికులు సంకలనకర్త అభిప్రాయం. “పండితుడు, వ్యుత్పన్నుడు, హృదయం గలవాడు, ప్రేమించినవాడు, బాధపడ్డవాడు, జీవించినవాడు. పూర్వపు సంస్కారమంతా బలాన్ని కూరుస్తూవుండగా, రాదగిన నూతనత్వాన్ని ఆహ్వానించాడు. నూతన పంథాతొక్కిన కవులలో చాలమందికి బలమూ, హుషారు ఇచ్చి నూతన కవిత్వయుగస్థాపనకు తోడ్పడ్డాడు. విద్వాన్ విశ్వంగారు ఇలా అంటారు. “ఈభావకవితకు ప్రాపుగానిల్చి పనిచేసిన సాహితీసమితి సభాపతి తల్లావఝ్ఝుల శివశంకరశాస్త్రి సాహితి, సఖి, జ్వాల, వంటి పత్రికలు, నడపి మహోత్తమమైన సాహితీసేవ నొనర్చిరి. శ్రీ శాస్త్రిగారు (స్వామి) బహుభాషలలో పండితులు. ఏమంచినైనా ఆస్వాదించగల రసహృదయం గలవారు. చక్కని విమర్శకులు. అనంతంగా వ్రాసినవారు.

ముఖ్యంగా పద్యగేయ నాటికలు రచించినవారు. వీరి అసలా భావకవిత్వానికీ, సాహితీసమితికీ చాల సాయపడినది. కవిత్వాన్ని ఒక ఉద్యమంగా భావించి, అనవరత పరిశ్రమ చేసినవారు శాస్త్రిగారి 'దీక్షితదుహిత' పద్యనాటికకు పీఠిక వ్రాస్తూ శ్రీ కురుగంటి సీతారామాభట్టాచార్యులు ఇలా వ్రాశారు. "శ్రీ శివశంకరశాస్త్రిగారి పాండితి, వారిసాహిత్యకృషి, వారిగ్రంథపరంపర, ఆంధ్రదేశమున ముప్పది సంవత్సరములకు పైగా వ్యాపించియున్నవి. వారు స్థాపించిన 'సాహితీసమితి'యే ఆంధ్రదేశములో నవ్యసాహిత్యమునకు దోహదమొనర్చినది. వారు నాటకరచనలో సిద్ధహస్తులు. ఆయన వ్యక్తి కాదు ఒక సంస్థ.' అనే నాటికకు, విమర్శ వ్రాస్తూ శ్రీ వావిలాల సోమయాజులుగారిట్లనిరి." మనోహరమైన భావాలు, మధురచ్ఛందస్సులు, మానసిక తత్త్వపరజ్ఞానము, పాత్రపోషణ గంభీరత, క్వచిదలంకారప్రయుక్త్వము, నిశ్చితాభిప్రాయాలు, నియమితాశయము; నాటికలోని, నానాగుణములు.'

ఆంధ్రజ్యోతి ఎడిటర్ ఆయన సాహితీసేవను శ్లాఘిస్తూ ఇలా అంటారు. 'శ్రీ స్వామివారు పద్మావతీ చరణచారణచక్రవర్తి. ఆయన స్థాపించిన 'సాహితీసమితి'లోని రచయితలు, కవులు, వచన రచనకు ఒక ఒరవడిని ఆయున్నుంచే స్వీకరించారు. ఆయన బహుభాషాకోవిదులు. తెలుగు, సంస్కృతం, ఇంగ్లీషు, బెంగాలీ, పాళీ, హింది, మరాఠీ, ప్రాకృత భాషలలో వీరికి మంచి పాండిత్యమున్నది. 1919 నుంచి తెలుగు సాహిత్యాన్ని ఒక మలుపుతిప్పిన సాహితీసమితి 'సభాపతి' గా ఆయన ఒక ఉద్యమంగా కృషి సలిపారు. నోరి నరసింహశాస్త్రి, దేవులపల్లి కృష్ణశాస్త్రి గారలు శ్రీ స్వామిగారిని అన్నగారుగా, ఆప్తునిగా చూసుకునేవారు. వెనుకటితరం కవులకు నేటికవులకు మధ్యనిలిచిన సుప్రసిద్ధ సాహితీవేత్త శ్రీ స్వామి. ఆయన విద్యావాచస్పతి, కవిసార్వభౌమ, మహోపాధ్యాయ, సాహిత్యాచార్య, సాహిత్యసమ్రాట్ బిరుదాంకితులు.' ఆయన్ను అనేకులు 'సాహితీసభాపతిగా' పద్మావతీ చరణచారణ చక్రవర్తిగా, నవయుగవైతాళికుడుగా, సుప్రసిద్ధ (పాళీ) భాషాను వాదకుడుగా శ్లాఘించారు. ప్రతిభకు పట్టం కట్టారు. ఆయన 14 భాషల్లో పండితులు. సాహితీ విమర్శకులుగా తెలుగుభాషకు అమూల్యమైన సేవ చేశారు.

వారి కావ్యసందోహమంతయు సమీక్షించి, **The Mind And Art of Sri Siva Sankara Sastry"** అను మహాగ్రంథమును పోతుకూచి సుబ్రహ్మణ్య శాస్త్రిగారు, 'శివశంకర కావ్యదర్శన్' అనే సమీక్షకృతిని హిందీలో రాచకొండ నరసింహమూర్తిగారు, రచించి ఆయన ప్రతిభను, ఘనతను, దర్పణముపట్టి చూపిరి. ఇపుడిక శ్రీ స్వామివారు లేనిలోటు తీరుట కష్టము. ఆయన భారతీయుడగుట మన అదృష్టము.



# అన్నా కాళోజీ!

ఆచార్య యస్వీ. జోగారావు, ఎం. ఏ., పి. హెచ్. డి.
ఆంధ్రా యూనివర్సిటీ.

* అన్నా కాళోజీ!
కరుణకు సున్నా చుట్టిన కాలంలో
కవితకు పెట్టిన కాలేజీ!
లోకంలో గోడవంతా
'నా గోడ'వని భావించే నానాజీ!

* బవిరి గడ్డం లేదుగానీ
బారెడు జడలు లేవుపోనీ
భావాల పుట్టలోంచి
భవ్యార్ష కవితాకృతిగా
బహిర్గమించిన బాబాజీ!

* కలంచేసే కసరత్తులతో
పదాల పటాలం దూసే కత్తులతో
కవితారంగంలో కవాతుచేసే కాళోజీ!
అక్రమ విక్రమార్కులను -
మెడలగొడతావు
నవభావుకులను నవ్విస్తావు

* ధర్మవీర దయావీర ధౌరేయుడివై
ఖలీల్ జిబ్రాన్‌లా కరుణహాస్యరసాల
లవ్ మేరేజీకి లగ్నం పెడతావు
కార్పిస్తా వొకకంట కన్నీరు
మాచే మరోకంట పన్నీరు

* అసలు రసాల కవిత్వం కాదు నీది
అది ఎదిరి రొద టైరు బరస్టయ్యే
చాదస్తాన్ని రిటైరుచేసే
సెటైరు మసాలా కవిత్వం
కాదు కాదు నీది రసాల కవిత్వం
అవునవునది అభ్యుదయ భావాల
భారసాల కవిత్వం

* సహజ కవివి సమాజ కవివి
సదయ కవివి సహృదయ కవివి
అసలు కవివి కాదేమో నువ్వు
కరుణ నిండిన అంతఃకరణంతో

అనుభూతి శ్రుతి లగించి బిగించి
అక్షరాక్షరంలో ప్రాణకళ ప్రతిష్ఠించిన
కవిబ్రహ్మ కల్పనాశిల్ప సంకల్పశిశువ్వు
కట్టి మామూలుమనిషివిసుమా నువ్వు!

# గ్రంథసమాలోచన

## విశ్వవిపంచి

[ రచన : ఆచార్య భాస్కర్. 1/8 డెమ్మీ, 50 పుటలు, వెల రూ 3 లు. ప్రతులకు : విక్రాంతి పబ్లికేషన్స్, 13-5-22, శ్రీనగర్, విశాఖపట్టణం-1. ]

పుట్టినబిడ్డను చూచి ఒకవేళ ఆబిడ్డ మిక్కిలి నల్లగనున్నపుడు తండ్రి ఎదుట తెలుపు అని చెప్పకపోయినను 'అంత నలుపుకాదు' అనుట తప్పుకాదు. ఈ కవితా సంకలనము 'అంతతీసి వేయవలసినదికాదు'.

అప్పుడప్పుడు కొందరు పెద్దల కవితా సంకలనములు చూడగా వారు అవి చిన్నతనమున వ్రాసియుందురని భ్రమింపజేయుట లేకపోలేదు. కొందరు యువకుల కవితాసంకలనములు యువకులవని తెలియకుండిన - పెద్దలు వ్రాసినట్లుగను అనిపించుటకూడ కలదు.

ఇది ఈ రెండింటికినీ చెందని పుస్తకము. 40 'భావరాగమాలికలు'. ఆచార్య డాక్టర్ సి. నారాయణరెడ్డి తమ సంక్షిప్తాభిప్రాయమున 'ఈకవి తపన అభ్యుదయ భావాన్ని అందంగా చెప్పాలని' అనిరి. అది ఎంతవరకు ఫలితినది అన్నది విచార్యము.

ఇందులో కొన్ని నినాదాలకు చెందిన రచనలుకాగా ఇతరములు కొన్ని. 'ఇంకో సూర్యుడు' కవితలో (పుట 34) భావము దీప్తిమంతమైనది.

"ఈ లోకంలో
ఇప్పుడున్న సూర్యుడుకాక
ఇంకో సూర్యుడు ఉదయిస్తే
ఎంతో బాగుంటుంది
కొత్తగా ఉదయించే సూర్యుడు
పద్మాల వికసింపజేయ నక్కరలేదు.

మనం చేసే ప్రతికర్మకీ
సాక్ష్యంగా నిలబడనక్కరలేదు
ముకుళించుకుపోయిన
హృదయాలను
వికసింపచేస్తేచాలు
మానవతాభావానికి
బాసటగా నిలబడితేచాలు !

—ఈమాత్రం చక్కని భావంలేని కవితలూ దీనిలో నున్నాయి.

కాని భవిష్యమున ఆత్మవిమర్శనా దృక్పథము గలిగి, రచనలు చేసిన; ఉత్తమ స్థాయికి చెందగల కవితాసంపుటములు వెలువరించగల గట్టి సూచనలు గలవు.

ఈ సంపుటములోని కవితలలో భావాలకన్న ధ్యేయాలుమిన్న. కాని రచయిత పేరు భావన్. ఈయన 'జానపా కృతులు - సంప్రదాయము - నవ్యత' అను అంశము - గూర్చి పరిశోధన చేయుచున్నవారు.

అమృతభిక్ష అనునది ఒక చప్పని కవిత (?)
వాదం వేణువాదం
కవిత కావేరి
సమత సావేరి
మతం సమ్మతం
మనస్సు ఇంద్ర ధనుస్సు
తపస్సు పవిత్ర హవిస్సు
దీక్ష శ్రీరామరక్ష
అఖండ మానవాత్మకి
అమృతభిక్ష

ఇటువంటి వానిని చేర్చకుండ- పెద్దలచేత ఎన్నిక చేయించుకునో- తాను ఎన్నిక చేసికొనియో- బాగున్న వనిపించు కొన్నిటిని ప్రచురించుట ఉత్తమము.

"భరతమాత కన్నబిడ్డలలో ఒకడు కవి తిక్కన. ఒకడు ఖడ్గతిక్కన. సుధలు కురిపిస్తానంటా డొకడు. రక్తం చిందిస్తానంటాడొకడు. ఆమెకు కావలసింది కావ్య సుధలు. రక్తపాతాలుకావు. సమత, మమత- ఇవి సాధించాలంటే ప్రతికవితిక్కన-

ఖడ్గతిక్కన కావాలి. ప్రతి ఖడ్గతిక్కన కవితిక్కన కావాలి" — ఇది 'సమతా-మమత' అను శీర్షిక క్రింద వ్రాసిన కవిత- వరుసలుగా వ్రాయబడిన వాక్యములు.

అందుచేతనే శ్రీ ఆరిపిరాల విశ్వంగారు "పదాలు విరిగితేనే కవిత కాదు" అన్నారు. కవితకు 'అందం, ఆనందం పరమావధి' అన్న బాలగంగాధరతిలక్ గారి వాక్యములు విస్మరించరానివి. ఆచార్య భావన్ గారు సాహిత్యపరిశోధకులు కనుక- ఇకనుండి వారిలేఖిని కవితాతత్త్వజ్ఞులు మెచ్చగల కవితలు వ్రాసి రంజింపజేయ వలయునని ఆకాంక్షింపవచ్చును.

తెలుగునాట, క్రింది విధములయిన కవితా సంపుటములు వెలువడుట కలదు.

(1) స్వీయ కవితా సంపుటములు.
(2) వివిధకవుల కవితా సంపుటములు.
(3) అనువాదములతో గూడుకొనిన మూలకవితల సంపుటములు.
(4) కేవలము పద్యకవితలు గలిగినవి.
(5) కేవలము వచన కవితలు గలవి.

పైవానిలో మొదటి రకమునకు చెందినవి ఎక్కువ ప్రచురితములగు చున్నవి. రెండవరకమునకు చెందిన ప్రథమగణ్య గ్రంథము కాటూరి వేంకటేశ్వరరావుగారు అనుపమ పాండిత్యము గలిగినవారయి- తయారుచేసిన తెలుగు కావ్యమాల. ఇందన్ని రకముల ప్రక్రియలకు చెందిన సత్కవితలు ప్రచురించిరి. తరువాత వచ్చిన వానిలో ముద్దుకృష్ణగారి "వైతాళికులు" ప్రశంసలు పొందినట్టిది. 'మణిమాల' వంటి వెన్నియో వచ్చినవి. కేవలము వచన కవితలకే ప్రాధాన్యమిచ్చి వచ్చినవానిలో శ్రీ వందూరి రామమోహనరావు శ్రీ ఇంద్రగంటి శ్రీకాంత శర్మగార్ల 'మహాసంకల్పం' పేర్కొనదగినదికాగా, పద్యవచన కవితల సంపుటములలో - 'అగ్నిగర్భ' పేర్కొనదగినది. ఈ అగ్నిగర్భమున సుప్రసన్న కవితలు పెక్కులు. ఇంతకును స్వీయకవితా సంపుటములలో నిలబడ గలిగిన రచనలు ఆచార్యభావన్ గారు తప్పక చేయవలెనని అందుకు వారు ప్రయత్నించెదరని భావించుట భవిష్య శుభాకాంక్ష యగును కదా! ఈ కవి విశ్వకల్యాణవాంఛ ఎన్నదగినది.

— శ్రీ సన్నిధానం

—0—

# ఉపనిషత్తు - కాలామృతము

[ ఉపనిషత్తు - కాలామృతము అను భారతీయ తత్త్వచరిత్ర. రచయిత : శ్రీ నిడమర్తి వేంకట శేషగిరిరావుగారు. మూల్యము 4 రూ. ప్రతులకు 277/ RT విజయనగర్ కాలనీ, హైదరాబాదు. 500028. ]

లోకములోని విచిత్రత బహుముఖీనమై కానవచ్చును. రాజకీయములు, వేదాంతము, రచనావ్యాసంగము, (కవిత - విమర్శ) మున్నగువానిలో మానవుని కర్తృత ఆభాసమాత్రమైనను యథార్థభాసమై యుండును. అదియే భ్రాంతి. సృష్టివైచిత్ర్యము. అజ్ఞాతశక్తి సృష్టుడైన యీ మానవుడు తన ఆలోచనాసృష్టికి తన్మయుడై తుదకు వికలిత వేద్యాంతరుడై, సర్వం మరచిపోతాడు. ఈస్థితికి మనుష్యుని త్వరగా తెచ్చినట్లుండేది వేదాంతం. ఈమాటకు అర్థమేమియో తెలియకున్నను ప్రమాదరహిత మగుటయే దీని సహజాకర్షణకు మూలము. దీనికి శ్రుతపాండిత్యము తోడైనచో నగ్నికి వాయువు తోడైనట్లే. అది స్వపక్షపరపక్ష నిర్ధూమధామముగా నుండుటలో నాశ్చర్యమేమున్నది ? వెనుకటికాలములో ప్రస్థానత్రయము సేవించితిని, భామ్యశాంతి గావించితిమనెడివారు. ఆసేవకు పూర్వరంగముగా బహుశాస్త్రములు, కావ్యములు, అనుభవసాధన, లోకజ్ఞత, మున్నగునవి యుండెడివి. ఇన్నిటిసాయమునంది నాటి ప్రస్థానత్రయ సేవారిరంసువు లయ్యెడివారు. నేడు మన యదృష్టమున జ్ఞానవిజ్ఞానముల భేదజ్ఞాన మక్కరలేకుండగనే పుస్తకములు వెలువడినవి. అది మానవుని జ్ఞానాజ్ఞానములలో దేనికి చిహ్నమో తెలియరాని తన్మయతలో నున్నాము. అట్టి గ్రంథములలో "ఉపనిషత్తు - కాలామృతము అను భారతీయతత్త్వచరిత్ర" యను గ్రంథ మొకటి.

ఈగ్రంథమున (1) ఈశావాస్య (2) కేన (3) కఠ (4) ప్రశ్నోపనిషత్తులు సమూలములై తాత్పర్యసహితములై యున్నవి. ఇవికాక (1) పరమాత్మ - దేవతలు ప్రజలు (2) బౌద్ధము ఇతరనాస్తికమతములు (3) ఉపనిషత్తు - కాలామృతము - అధ్యాత్మ (4) తత్త్వము (5) జ్ఞానము (6) మృత్యువే సూర్యుడు (7) తాంత్రికము విశ్వామిత్రసృష్టి (8)-విశ్వామిత్రసృష్టి - తాంత్రికతత్త్వము (9) చతుర్వర్ణవ్యవస్థ - వర్ణధర్మము (10) సూక్ష్మశరీరము - పునర్జన్మ (11) మిథ్యావాదము-మాయావాదము (12) జీవుడూ పునర్జన్మ (13) బౌద్ధసంస్కారము - ఫలితము (14) మహావీరుని సంఘసంస్కారము ఫలితములు (15) శ్రుతిస్మృతిపురాణ ఇతిహాసములు (16) యుగకల్పన-యుగధర్మములు )17) జ్యోతిషము (18) యుగధర్మము (19) భక్తి (20) భక్తి

యోగము అను వ్యాసములు కలవు ఇది మొత్తము రెండువందల యేబదిగైదు పేజీల మహాగ్రంథము.

ఇందు ముద్రారాక్షసములు బహుసూక్ష్మములు - సంయుక్తాక్షరములు (4 పే) మరి స్తుల (2) మొదలైన వర్ణలోప వర్ణాగమ వర్ణవ్యత్యయములు తరచుగా నగపడును. మరియు 'భుజబల అంగబల, (1) సుఖకోరికలు, (8) వుపాసన, (29) సూర్యఅగ్ని, (20) స్తోమహత్తు (28) పోషపదార్థము (28) శరీర అవస్థలు (29) శక్తివంతమైన (30) జాగ్రత స్వప్న సుషుప్త్యావస్థలు (31) శోచన (31) గార్హపత్యఅగ్ని (32) దుష్ట ఆశ్వములవలె (33) భిన్న భిన్నఏర్పు (42) అంతరాత్మగా యుండి (46) రశోసంబంధ (53) జ్యోతిరూపములు (80) ఊర్ధ్వఅధోలోకములు (84) దశ విధ ఉపనిషత్తులు (32) అధికృత బౌద్ధ అద్వైతిధర్మములు, (85) మువ్వగుసవి కోశాల్లలు.

ఉపనిషద్వివరణలో (10 పే) తన్నవ్యజానంత కిమిదం యక్షమితి' ఇట యక్షం అనుదానికి ప్రక్క పేజీలో యక్షిణిని అని, యొకచోట చెప్పి మరొకచో యక్షుడని చెప్పిరి. యక్షిణీ, యక్షులు భిన్నులుకదా! అట్లే 18 పేజీలో తిస్రోరాత్రీర్యదవా త్సీర్గృహేమే ఒనశ్నన్ బ్రహ్మన్నతిథిర్నమస్య - దీనికి వివరణ నచికేతుడు మృత్యుదేవ తను జేరుటకు మూడుఅహోరాత్రులు అన్నము నీరు లేకుండవుండెను అని యిచ్చిరి. నచి కేతుడు మృత్యుగృహమున మూడురాత్రులు (పగళ్ళు మూడు కావచ్చును, రెండుకా వచ్చును - అహోరాత్రములు మాత్రము మూడుకావు) నివసించెను. 'అవాత్సీః' అనుపదము 'నివసించితివను నర్థమును చెప్పును. 20 పేజీలో 16 లో - స్వంకాం చేమా మనేక రూపాంగృహాణ - దీనికి వివరణలో స్థానము లేకపోగా మిగిలిన మూడుపాద ముల భావము గూడలేదు. అట్లే 23 పేజీలో - ఇమారామాస్సరథాస్సతూర్యాః నహీదృశాలంభనీయామనుష్యైః - దీని వివరణయు లేదు. ఇట్టివి బహుసంఖ్యలో నున్నవి.

ఇక వ్యాసములలో మొదటిదానియందు జైనమతము వేదమతముల గలిపి విగ్ర హారాధన నారంభముచేసిన దని వివరించిరి. క్రమముగా మిగిలిన వానియందు జైన వేద మతముల సాంకర్యము (రాజీ)ను మరింతగా సమర్థించుచు, బౌద్ధమతము నభినందించు టయే వీరి గ్రంథపరమార్థముగా గనబడుచున్నది. అథర్వణవేదము జైనులచేనిర్మితమని (వేదములు పౌరుషేయములని కొందరి నిశ్చప్రచవాదముకదా) ఉపనిషదాదుల నిర్మా ణముగూడ జైనమునులు ఋషులు చేసియుందు రని వాల్మీకి జైనసిద్ధాంతములనాధారము చేసికొని రామాయణమును రచించెననియు, ఆదిశంకరులు ప్రచ్ఛన్న బౌద్ధమతాభి మానియనియు, బహువిధముల వివరించి పాఠకు నంగీకరింపజేయుటకు పాటుపడిరి.

బౌద్ధాద్వైత ధర్మములను మనరాజ్యాంగ వివరణలతో వివరింప యత్నించిరి. మంత్రములు తంత్రములు పాపపూజలు, భిక్షులు, బాబాలు మున్నగువారిని యథాశక్తి స్మరించి వారిపై దమకుగల జుగుప్సను వ్యక్తము గావించిరి. మంత్ర తంత్రములలో జైనము వేదమతమును కలుపుకొన్న దని నిరూపింప యత్నించిరి. వీరి యభిప్రాయము ననుసరించి శ్రీరామానుజుల వైష్ణవము, బసవేశ్వరుని వీరశైవము (లింగార్చన) (నీలకంఠుల వారి పేరు వీరికి దోచలేదేమో) మున్నగునవన్నియు జైనసముదాచార సముత్పన్నములే యని నిరాఘాటముగ నూహించిరి. శంకరులవారి యద్వైతము బౌద్ధమే యని వీరి నిశ్చయము. వేదమత ధర్మములన్నియు బౌద్ధమతమును దాని వికాసమును, ధర్మములను పాటించి జైనమతసహాయమున బౌద్ధమునకు ద్రోహము గావించెనని వీరి నిశ్చయము. బుద్ధుని తరువాతనే వారి వ్యవహారము నాకళించికొని మనవారు దర్శనములు, ఉపనిషత్తులు, శాస్త్రములు, నాటకాదులు మున్నగువానిని నిర్మించియుందురని వీరి యూహ. "సన్యసించిన అనగా యితరుల సొత్తుకు ఆశపడని, పూర్తిగ విడచిన న్యాసం సన్యాసముగా సంకల్పములుగల కర్మలై యుండవలె"నని వివరించిరి. తత్త్వమసి వాక్యమున కున్నన్ని యర్థప్రకారములను వీరు తడవ లేకపోయిరి. వీరు మధ్యలో సోషలిజంనుకూడ దీనితో సమన్వయపరచిరి. దానము ధర్మముగా ముష్టి వృత్తిని వృద్ధిచేయు ప్రచారము జరుగుచున్న దని నడుమనడుమ విచారించిరి. "కులమత ఆడ మొగవిచక్షణలు లేని ధర్మమును" వివరించిరి. వేదాంత విషయమున గురుశిష్యుల బోధలు తప్ప మరొక్కటిలేదే యని విసిగిరి. విశ్వామిత్రుని విశ్వమున కమిత్రునిగా విడదీసి మిక్కిలి శ్రమపడిరి. విశ్వామిత్రుని జైనునిచేయవందులకు మనము కృతజ్ఞులమై యుండవలెను. ఇవన్నియు (వేదమత ధర్మాచారములు) బ్రాహ్మణుల యౌన్నత్యమునకై కల్పింపబడిన వని వీరి విచారము. ఈ బ్రాహ్మణులు లోకులను వంచించుచున్నారే యని వీరి యాక్రోశము. శ్రీమంతము (సీమంతముకాదు) కూడ జైనానుసారకల్పితమేయని వీరి యభిప్రాయము కావచ్చును. వీరి సిద్ధాంతము ననుసరించి సర్వము బుద్ధాధీనము. కాని పాపము వేద జైనమతములు నీర క్షీరములవలె కలిసి బుద్ధుని మతమున కన్యాయమును గావించినవి వీరి దృష్టిలో. సీత నగ్ని ప్రవేశము గావించిన రాము డేల అగ్ని ప్రవేశము చేయలేదని వీరిప్రశ్న. రామాయణము కామధర్మ ప్రధానము. జైనులసాయమున వాల్మీకి దానిని మంత్ర పూరితముగ తద్ధర్మములలో రచించెను. ఇట్లనేక రీతుల చిత్ర విచిత్రమై వీరి రచన సాగినది.

మన యదృష్టము కొలది వీరు గీతను తరచుగా స్మరించిరి. శ్లోకసంఖ్య నిచ్చి దాని భావమును వివరించుటకన్న శ్లోకమునిచ్చినచో మరింత బాగుండెడిది. గీత యొక్క గీతయు బుద్ధుని తరువాతనే వ్రాయియుండవచ్చునని వీరి యూహయేమో? యంత్రముమీద గీత గీత బాగున్నది. మిగిలినవాని గీత బాగులేదు.

వాక్య దోషములు పుష్కలముగా నున్నవి. ఉదా :- (90 పే) ప్రస్థానత్రయముగా బ్రహ్మజ్ఞానమును తెలుపునవిగా ఉపనిషత్తులు బ్రహ్మసూత్రములు భగవద్గీతకు శ్రీ ఆదిశంకరులచే భాష్యములు వ్రాసినట్లు చెప్పుదురు.” 83 పే. “జైనమతమున జీవహింస మానవలె నని జీవులను పోషించవలె నని జైనమతస్థులచే బయలుదేరి శ్రీరాముడు శ్రీకృష్ణుడు హనుమంతుడు గోవు మొదలైన విగ్రహారాధనగా మొదట బయలు దేరినది.” ఈ వాక్యమునకు ముందుగా “అధర్వణవేదము బౌద్ధమతమున మానవధర్మముగా బయలుదేరిన అహింసకు బదులు” అను మరియొక వాక్యభాగము కలదు. వాక్యములు దీర్ఘములై వక్త యభిప్రాయము నెరుగనీయవు. అట్టి వాక్యములనేకములు. వీరు తమకు సమర్థకముగా నిచ్చిన శ్లోకము దోషదుష్టమై యుండును. ఉదా :- “జన్మనాజాయతే శూద్రః కర్మణాజాయతే ద్విజః, వేదపఠనంతు విప్రః, బ్రహ్మజ్ఞానంతు బ్రాహ్మణః” ఇందు క్రీగీతగల భాగము విచారణీయము. ఛందోవిధానము గూడ విచారణీయమే యగునేమో ?

వీరికి రామాయణము అయోధ్యకాండ 109 సర్గ శ్లో 34. రాముడు బుద్ధుడు దొంగ నాస్తికుడని చెప్పుట బాధాకరముగనున్నది. సుందరకాండములో 15వ సర్గలో లంకయందలి మండపము బౌద్ధ చైత్యమువలెనున్న దనుటచే వీరిదృష్టిలో బహుశః రావణుడు బౌద్ధదేవాయతనమును మన మూహింపవచ్చును. సుందరకాండలోని సురసావిజయమును బట్టి సుశ్రుతుని గ్రంథరచన తరువాత (అందు శస్త్రచికిత్స వివరింపబడినదట) శ్రీరాముడు బయలుదేరి యుండునట. వీరికిష్టమైన బుద్ధు డెవరో వారికి లక్ష్యమైనట్లు లేక వారిట్లు బుద్ధునికై వెదకుచుండిరేమో ? బుద్ధులు చాలమంది వారి కగపడియుందురు. (కనీస మిద్దరు ముగ్గురైనను)

గ్రంథనామములోనే హంసపాదు పడినది. ఉపనిషత్తు - కాలామృతము అను భారతీయతత్త్వచరిత్ర యేమి ? మన యుపనిషత్తు ఏకవచనముగుటలో నర్థమేమి ? కాలామృతమేమి ? ఇదేమైన జ్యోతిష గ్రంథమా ? మరల దానిక్రింద భారతీయతత్త్వ చరిత్రయా ? మొత్తము మీద గ్రంథమంతయు ప్రచ్ఛన్నబౌద్ధమై యున్న దన వచ్చును.

పరమగంభీరమగు మత వేదాంతోపనిషద్విషయ వివరణమున భాషాసౌష్ఠవము, విచారణా గాంభీర్యము, బహుధా పరిశుద్ధి, యావశ్యకములు. అందులో నివి

గహనము. కావున మరింత జాగ్రత్త యవసరము. అద్వైత విశిష్టాద్వైత ద్వైతముల యుత్పత్తి, ప్రచారము, యథార్థత కొన్ని వేల సంవత్సరములనుండి యున్నవి. మన మెంత విమర్శకులమైనను మనవంటి వారినెందరనో యివి చూచియుండును. వాని వలని లాభనష్టములు మనకు గాని, మనవలన వానికేమియు లేదు. వాది బలముకన్న వాదబలము ముఖ్యము. అనుభవము బహుప్రకారము. సాన్నిధ్యము, సాయుజ్యము మున్నగున వస్థాములచే నీ మతవిభాగ మేర్పడిన దని కొందరందురు. ఏమైనను మత ధర్మవిచారణ మిక్కిలి కష్టము. అద్వైతాదులు శంకరాదులతో ప్రచారమునకువచ్చినవి కాని వారిచే నుత్పత్తి చేయబడలేదు. వారందరు జ్ఞాపకకరణములే గాని యుత్పాదక కరణములు కారు. కర్మసిద్ధాంత ప్రధానమగు మతమున నంతయు జ్ఞాపకకరణమే యగునేమో ? సగుణనిర్గుణ భేదకల్పన యధికారి భేదమునుబట్టి వచ్చినది. స్వామి వార్లు సగుణోపాసకులగుట లోకము కొరకే గాని వారికొరకు గాదు. ఉత్తమ మధ్య మాధములు లేని విభాగము లేక జాతి లేదా మతము మరేదియు లేదు. శ్రీ శంకరుల యద్వైతమే లేనిచో జైన బౌద్ధములు మనలను ముంచెత్తిడివి. అసలు బుద్ధుడెవరు ? త్రిపురాసుర సంహారములోని వాడా ? దశావతారములలోని వాడా ? శాక్యవంశము వాడా లేక జ్ఞానవంతుడను నర్థము కలవాడా ? అట్లే జినశబ్దమును, అర్థమును, విచారణీయమై యున్నవి.

మతమనగా నిష్టమైనదని యర్థము. కాని దానితో మరియొక మతమును బోల్చుట యొక భక్ష్యముతో మరొక భక్ష్యమును పోల్చినట్లుండును. దేని వైశిష్ట్యము దానిదే. సేవకుని వివాహమున రాజు ప్రధానుడు కాడు. రాచకొలువులో సేవకుడు ప్రధానుడు కాడు. దీని భేదమును గుర్తించుటయే యౌచిత్యము.

శ్రీ శేషగిరిరావుగారిందు తమకుగల బహుళీనమగు ప్రజ్ఞను వెల్లడించిరి. వీరిందు పడినశ్రమ చాలగొప్పది. ఆయామత సిద్ధాంతముల నాకళించుకొనుట, దానిని స్వమతానుసారముగ మలచుకొనుట సామాన్యము కాదు. ఈ గ్రంథము వీరికిగల బహుగ్రంథ పరిచయమును పరిశీలనాశక్తిని, వ్యక్తము చేయును. ఎవరికిని దెలియనిది వేదాంతమే యైనను వీరిందు దమకు దెలిసిన దనుకొన్న దాని నితరులకు వెల్లడింపయత్నించుట వీరి సంఘాభిమానమును సూచించును.

వీరు మరింతగా ననుభవజ్ఞాన భాషాసౌష్ఠవములతో సద్గ్రంథరచనము చేయగలరని యాశింతము.

—•—

# పృథ్వీ సూక్తము

— శ్రీ జమదగ్ని.

౧ పుడమి తల్లి మాహాత్మ్యము
నోడలు జలదరింప మీకు
నడు గడుగున భక్తి పాడమి
జడ నుడుపగ వివరించెద ॥

౨ పాడిచి పాడిచి నిద్రలేపి
యెడ పెడ వాయించి రెండు
కుడి యెడమలు చూపి ముందు
ముడి వీడగఁ జేసెనాకు ॥

3 నుడితో నను వెలువరించి
గుడి గట్టెద నా పుడమికి
విడి వడి మీ సందియముల
వడు గిడి సేవింప రండు !!

౪ అవనియే తల్లి యీ యఖిల జీవావళికి
నవని నంతటిఁ గ్రమ్ము నాకాశమే తండ్రి
అవకాశమే బ్రహ్మ కాది యవతారంబు
అవని యాతండ్రి మాయా విలాసమె యౌను ॥

౫ ఎదురెదురుగా నున్న యీ తల్లి దండ్రులను
కదురుగా వెలుఁగుచోఁ గుదురకుండును మనుజు
మది యుండి యెదయుండి మరతురే సత్యమ్ము
అది యేమి తెలివి యీ యఖిల మానవ తతికి ॥

౬ జనకుఁ డొక్కండయ్యు జనని నానాత్వంబు
కనుచుంట తెలియక లోకం బందు సర్వత్ర
తనయు లెల్లరు తల్లి దండ్రి బిడ్డలు కారె
కన కుండునే తల్లి కడుపునం ద్విర్వారము ॥

౭ అవని యాలై మగం డాకాశమైయున్న
అవధి యేలేని విశ్వానంత సంసార
మవగాహితంబైన యానంద మందుఁడీ
ఎవఁ డెవం డెవఁడైన నీమాను సోదరుఁడె !

౮ ఆకాశ మొక్కటే యవని యంతయు నొకటి
ఆకాశమును భిన్న మగునట్లు చేయగా
లేకున్నయ ట్టిలయు నేకమే యై ప్రజా
నీకమ్ముచే భిన్న నియతి మాత్రమె పొందు ॥

౯ అదితి యీభూదేవి ఆమె ఖండిత కాదు
అదితి సంతానమ్మె ఆదిత్యు లెల్లరును
అదరేమి బెదరేమి ఆదిత్యులే జనులు
విదితాత్మ సత్త్వులై వెలయు చుండిన యపుడు ॥

౧౦ తము తామె మరచి దైత్యత్వము పొందుచో
అమరావనియు దితియె యైనట్లు కనిపించు
ఇమిడి యుండుటె గాని యెన్నఁడును తెగిపోదు
అమృత స్వరూపయా అమ్మయున్ తెగుటెట్లు ?

౧౧ అవని యంతయు నొకటి అట నటను ద్వీపముల్
ప్రవిభక్తమై తోఁచు పట్టి చూచిన యంత
భువి సర్వ మొక్కటై పొడచూపునే కాద
దివియెట్లొ భువి యట్లె త్రెంపఁ జాలని దౌను ॥

౧౨ ఆకాశమున నుండి యవని యానందాక
నేకాకృతిం దాల్చి యెల్ల భూతము లుండు
నేకమై ప్రవిభక్త మేమొ యన్నటు తోఁచు
నే కాని వాయ్వగ్ను లీ జలములున్ దెగవు ॥

౧౩ అమ్మ తెగినట్లుండు నసురులై మానవులు
క్రమ్మి మోహము దానికై లుబ్ధులైనపుడు
దిమ్మ దిమ్మను వేరు తీరులన్ పాలించి
క్రమ్మ కొందురుగాని ఖండింపగా లేరు ॥

౧౪ వరుసగా స్ఫుటమూచు వచ్చు వైవిధ్యమ్ము
ఎరుక యుండిన తొలఁగి యేకత్వ మగపించు
పరికింప సృష్టిలో వైవిధ్య మంతయును
స్థిరమైన యేకత్వ సిద్ధి కూర్చుట కొఱకె!

౧౫ అవనిరే యన్న మాయన్నమ్ము నుండియే
అవతరించిన పురుషుఁ డన్నమ్ము లిని పెరుగు
వివిధ దేహము లొప్పి భిన్నజాతులు గాగ
సవరించుటే గాని సామరస్యము నుండు ॥

(సశేషము)

# ఎందుకు ఓటు చేయాలి?

ఈ నెలలో జరుగనున్న విధానసభ (ఆంధ్రప్రదేశ్ లో) ఎన్నికలలో పాల్గొనే రాజకీయపార్టీలు ముఖ్యంగా మూడు. సంస్థా (రెడ్డి) కాంగ్రెసు, జనతా, ఇందిరా కాంగ్రెస్సును. ఉభయ కమ్యూనిస్టుపార్టీలు వేరువేరుగా ఎన్నికలలో పాల్గొంటున్నా, అవి రమారమి పదోవంతుకన్న తక్కువ స్థానాలకి పోటీచేస్తున్నందువల్లా; రెడ్డి కాంగ్రెసు జనతాపార్టీలతో సర్దుబాట్లు (ఒడంబడికలు) చేసికొని యున్నందువల్లా; ప్రత్యేకముగా పేర్కొనబడలేదు. గత 7వ సంచికలో అభ్యర్థుల గుణగణపరిశీలన విషయాన్ని గూర్చి స్థూలంగా చర్చించడం జరిగింది. ఇపుడు పార్టీలనుగురించి ఈచర్చ.

1 a) కాంగ్రెసుకి ఎందుకు వోటుచేయాలి ?

అనేక సంవత్సరాల ఉత్తమ చరిత్రకలది. సర్వస్వము సమర్పించిన త్యాగధనులయిన అనేక మహానాయకులకు, స్వాతంత్ర్యయోధులకు, సంబంధించినది. స్వాతంత్ర్య సముపార్జనకు సాధనమైనది, స్వాతంత్ర్య సంపాదనానంతరం ప్రజాస్వామ్యదేశంగా అనేక రంగాలలో దేశఖ్యాతిని పెంపొందజేసినది. - అనే కారణాలవల్ల కాంగ్రెసుకి వోటు చేయవలసియున్నది.

b) ఎందుకు వోటు చేయరాదు ?

సంస్థాగతముగాను, రాజ్యాంగపరముగాను నిరంకుశత్వమునకు, స్వార్థపరత్వానికీ, నిలయమైపోయింది. ప్రజాసామాన్యానికి సంబంధించిన అనేకసమస్యల్ని పరిష్కరింప లేకపోయింది. స్థానికపరిపాలన రంగంలోను, సహకార రంగములోను, సంస్థావ్యవహారాలలోను నామినేషనులకు అలవాటు పడిపోయి ప్రజాస్వామ్య లక్షణాన్నే కోలుపోయింది. నాటి స్వాతంత్ర్యయోధులు, త్యాగధనులు నేడు కాంగ్రెసులో లేరు. అవినీతిపరులకు ఆశ్రయంగా ఉంటున్నది. ఆత్యయిక పరిస్థితి ఉన్నంతకాలము భక్తి వలననైతే నేమి, భయంవల్ల నైతే నేమి దాని అవలక్షణాలనూ దారుణకృత్యాలనూ తెలిసో తెలియకో సమర్థించి వాటికి భాగస్థురాలైనది. ఆత్యయిక పరిస్థితిలోని దుష్కృత్యము లెన్నో నేటికిని సరిదిద్దబడలేదు. నిరంకుశత్వానికీ నిర్దాక్షిణ్యానికీ నిలయమని ఈనాడు తాను విమర్శిస్తూన్న ఇందిరావర్గాన్ని తనలో ఇముడ్చుకోవడానికి నిన్నటివఱకూ నానాఅవస్థలూ పడింది- పైకారణాలవల్ల కాంగ్రెసుకి వోటుచేసే విషయంలో బాగా సందేహించవలసివుంది.

2 a) జనతాపార్టీకి ఎందుకు వోటు చేయాలి ?

ఆత్యయిక పరిస్థితిలోనూ అంతకు ముందూ చెలరేగిన ప్రభుత్వపు నిరంకుశత్వాన్ని ఎదిరించి ప్రజాస్వామ్యపు విలువలని పునరుద్ధరించింది. భయభ్రాంతమైన ప్రజానీకానికి అభయహస్తమిచ్చింది. జనతాప్రభుత్వంలో అవినీతి ఆరోపణలతో కలుషిత జీవితంగల వ్యక్తులు మిక్కిలి తక్కువ. స్వార్థరహితంగా ఉత్తములెన్న్యలతో ప్రభుత్వం పనిచేస్తున్నది. ప్రజాస్వామ్యవిధానాన్ని ప్రోత్సహించడానికి కంకణం కట్టుకొన్న స్వాతంత్ర్యయోధు లనేకు లీపార్టీలో చేరియున్నారు. - ఈకారణాలవల్ల జనతాకి వోటు చేయవలసియున్నది.

b) జనతాకి ఎందుకు వోటు చేయరాదు ?

విభిన్న సిద్ధాంతాలుకల అనేక పార్టీల సమ్మేళనం ఇది. అవినీతి ఆరోపణలుగల వ్యక్తులుకూడ మంత్రివర్గంలో ఉన్నారు. నిన్నటివరకు కాంగ్రెసులో ఉండి ఆపార్టీ దోషాలన్నిటికీ, ఎమర్జన్సీ అమలుకూ, బాధ్యులయిన వారెందరో నేడీపార్టీలో పార్టీ ఫిరాయింపుద్వారా చేరియున్నారు. 9 నెలల జనతాపాలనలో ధరవరలు తగ్గడంకాని సామాన్యప్రజకు కలిగిన మేలుగాని ఏమీ కనబడదు. అవకతవకలతో కూడిన నామినేషను విధానమేగాని ప్రజాస్వామ్యవిధానంతో రూపొందిన పార్టీనిర్మాణం ఏమీ కనబడదు. ఎమర్జన్సీ నేరస్థులను శిక్షించడంలో జాప్యాన్ని, అసమర్థతని, ప్రదర్శిస్తున్నది. అసంతృప్తులైన కాంగ్రెసువాదులతో నిండి పోవుచున్నది.– ఈ కారణాలవల్ల జనతాపార్టీకి వోటుచేసే విషయంలో సందేహించ వలసియున్నది.

8 a) ఇందిరాకాంగ్రెసుకి ఎందుకి వోటు చేయాలి ?

ప్రభుత్వ విధానాలపై సత్వర నిర్ణయాలు చేయగల సాహసం. సామర్థ్యం కల వ్యక్తి ఇందిర. అనేక రంగాలలో క్రమశిక్షణను దృఢంగా అమలు పరచగలిగినది. తలచుకొన్నపని నిర్వహింపగల కార్యదీక్ష గలది. ఎమర్జన్సీ బాధ్యతను ఇతరులపై నెట్టి ఊరకుండక తనపై వేసికొన్న ధీరురాలు. పేద ప్రజల సముద్ధరణకై కంకణం కట్టుకొన్నది. ఈకారణాలవల్ల ఇందిరాకాంగ్రెసుకు వోటు చేయవలసియున్నది.

b) ఇందిరా కాంగ్రెసుకి ఎందుకు ఓటు చేయరాదు ?

ఇందిర నిరంకుశత్వానికి పెట్టింది పేరుగా నిరూపించుకొన్నది. పదవీ వ్యామోహంతో ఎమర్జన్సీ విధించి, నిస్వార్థ ప్రజాసేవకులను బంధించి ప్రజాసామ్య సూత్రాలన్నిటినీ నేలరాచింది. స్వకుటుంబ క్షేమానికి పాటుపడింది. తన ఉన్నతికి కారణమైన కాంగ్రెసును వెన్నుపోటుపొడిచింది. తన అనుయాయులూ, భక్తులూ, పేదప్రజల ఆస్తిపాస్తులకు తీరని హాని కలిగిస్తూ వుంటే ఏమీ పట్టనట్లు ఊరకొన్నది. అనేక దుశ్చర్యలకు కారకుడని ప్రజలు భావిస్తూన్న సంజయ కుమారుని సమర్థిస్తూన్నది. ఈమె పార్టీ తిరిగి అధికారంలోకి రావడం సంభవిస్తే చట్టబద్ధపరిపాలనా, ప్రజాస్వామ్యవిధానమూ భగ్నం అవుతాయి.– ఈకారణాలవల్ల ఇందిరా కాంగ్రెసుకి వోటుచేసే విషయంలో సందేహింపవలసి ఉంది. ఉభయ కమ్యూనిస్టు పార్టీలలోనూ చక్కని క్రమశిక్షణ ఉన్నది. చక్కని ఆర్గనైజేషనూ, సులభంగా పార్టీ మార్పిడులకు లొంగని స్థిరత్వమూ ఉన్నవి.

సి. పి. ఐ. కి ఎమర్జన్సీని సమర్థించిన కళంకం వున్నది. ఉభయపార్టీలకు దౌర్జన్యవిధానంపై విశ్వాసాన్ని పూర్తిగా ఖండించలేనితనం ఉన్నది. అన్నిపార్టీలలో అనేకవిధాల యోగ్యులైన వ్యక్తులు కొందరున్నారు. అవకాశవాదులూ, అవినీతి విధానదూయలు కానివారూ, ఉన్నారు.

ఓటుచేసే ముందు ప్రతివోటరూ పై విషయాలని పార్టీగతంగానూ, వ్యక్తిగతంగానూ బాగా ఆలోచించ వలసిఉంది. — సంపాదకుడు.

# ఈ పక్షంలో .........

## శ్రీ బాలమురళీకృష్ణ - కనకాభిషేకము

5-2-1978 తేదీని త్యాగరాజ నారాయణదాసు సేవాసమితి వార్షికోత్సవ సందర్భమున రాజమండ్రీ హిందూసమాజం న్యాపతి ఆడిటోరియంలో జరిగిన మహాసభలో శ్రీ మంగళంపల్లి బాలమురళీ కృష్ణునకు కనకాభిషేకం జరిగినది. సభకు తూర్పుగోదావరిజిల్లా ప్రిన్సిపల్ & సెషన్సుజడ్జి శ్రీ కోకా రంగనాయకులుగారు బి. కాం. ఆనర్సు బి. ఎల్. అధ్యక్షత వహించిరి. నాగమురోజులు జరిగే వార్షిక గానసభలలో మొదటిరోజున ఈ ఉత్సవం జరిగినది. హిందూసమాజం ఆవరణం క్రిక్కిరిసిపోయేలా స్త్రీ బాల వృద్ధ జన సమూహం సభకు హాజరైనది.

బ్రాహ్మణుల వేదవాక్కులతో సభ ఆరంభమైనది. గాయక శిరోమణి శ్రీ బాలసుబ్రహ్మణ్యశర్మ సమంత్రకంగా విఘ్నేశ్వరపూజచేసి సువర్ణ కుసుమములతో బాలమురళీకృష్ణునకు ప్రత్యేక రచితమైన చతుర్వింశతి నామావళితోను, కేశవాది నామములతోను పూజచేసిరి. కనులపండువుగా ప్రజానీకం ఈ ఉత్సవాన్ని హర్షధ్వానాలతో తిలకించింది.

బ్రాహ్మణుల ఆశీర్వాదమూ ఫలప్రదానమూ జరిగినవి.

మహాకవి శ్రీ మధునాపంతుల సభాప్రారంభమూ బాలమురళిపై పద్యములలో గావించిన ప్రశంసార్చనము రమణీయతా స్ఫోరకములు. శ్రీ శర్మా వేణుగోపాల స్వామిగారు బాలమురళీకృష్ణుని ప్రశంసించి గానకళా సామ్రాజ్యచక్రవర్తి బిరుదము నొసగి సన్మానించినారు. ఇకపై 'సామ్రాజ్య' ఆవశ్యకమా ? అనిపించును.

సేవాసమితి ప్రెసిడెంటు శ్రీ న్యాపతి రాఘవరావుగారూ గానకళ ఎడిటరు శ్రీ మునుగంటి శ్రీరామమూర్తి గారూ ఛాంబరు ప్రెసిడెంటు శ్రీ సంపత్కుమార్ ంగ్ ప్రభృతులూ బాలమురళీ కృష్ణు నభినందించిరి.

శ్రీ బాలమురళీకృష్ణ తిరువాయూరులోను, రాజమండ్రిలోను, తాము చేయు కృషిని వివరించిరి. తమకు జరిగిన సన్మానం అపూర్వం అనిరి. ఎలా జరగాలో అలా, ఎవరికి జరగాలో వారికి, ఎవరిచే జరగాలో వారిచే జరిగినదని సెలవిస్తూ ఇది అహంకారపుమాట కాదనిరి.

పై వాక్యములు ఎంత నిరహంకారంగానైనా శ్రీ బాలమురళి స్వయముగా చెప్ప నక్కరలేకుండ ఇతరులెవరైన చెప్పియుండిన, మరింత సముచితముగా నుండెడిది. కనకాభిషేక విధానము, దానిచరిత్ర, ఎవరైన వివరించియుండిన బాగుండెడిది. స్వర్ణాభిషేక మనక స్వర్ణసుమాభిషేక మనుటలోని ఔచిత్యమేమో తెలియదు కాని కుసుమములతో అభిషేక మను మాట వింతగా నున్నది.

బాలమురళి వర్ణించిన నామముల పూర్ణ శబ్దదోష రహితముగా నుండుట కింత మాత్రము జాగ్రత్తపడినట్లు తోచదు. [illegible] నామములలో [illegible] సమ్మేళనము కటువుగా అనిపించినది. స్వర్ణసుమపూజలో లేదా అభిషేకములో అర్చింపబడినది శ్రీ బాలమురళీకృష్ణ. ఆయన శివుడుగా పూజింపబడినట్లును చెప్పబడినది. అట్టివారిపై బ్రాహ్మణు లాశీర్వదించి అక్షతలు చల్లుటయు, ఆయన ఫలప్రదానము చేయుటయు, ఆ వితర్కమ [illegible] కనకాభిషేక కల్పమంతయు లౌకిక క్రియానిర్వహణ సమూపేతముగా జరగించి సమంత్రక ప్రక్రియ పొంతకు పోకుండుట మేలని తోచును. ఇకముందును ఇతోధికముగ గనకాభిషేకములు జరగుసూచన లున్నకారణమున నిర్దుష్ట రమ్య కనకాభిషేకవిధానము తత్‌జ్ఞులచే రూపొందింపఁ బడుట శ్రేష్ఠము.

6వ తేదీ సాయంకాలము జరగిన సభలో శ్రీ బాలమురళీకృష్ణ గానకళా ప్రదర్శనమున శ్రోతల సానందపఱచిరి. ఆరంభమున మహేశ్వరీ శబ్దభ్రాంతికి సంబంధించిన ఆశాభంగమును గూర్చి నిండుసభలో చమత్కరింపకుండిన బాగుండెడిది. వారి గానకళా ప్రతిభలో అంశమాత్రమే ప్రదర్శింపబడిన దని శ్రోతలు కొంచె మాశాభంగము నొందిన ట్లనిపించినది.

వారములో మిగిలిన రోజులలో అనేక - ప్రోగ్రాములు సక్రమంగా సకాలమున జరగినవి. ముఖ్యంగా 7వ తేదీ శ్రీ చల్లపల్లి చిట్టిబాబు వీణాగానం 9వ తేదీ శ్రీ యం. ఎస్. బాలసుబ్రహ్మణ్యశర్మ గాత్రం వేలకొలది శ్రోతలను సమ్మోహపరచినవి.

27 సంవత్సరములనుండి గానసభల కార్యక్రమం అత్యంత దిగ్విజయంగా నడపించుచున్న శ్రీ బుగ్గాపాపయ్యశాస్త్రిగారెంతో అభినందనీయులు.

మీరా మనోహర కావ్యావిష్కరణము.

12-2-78 తేదీ సాయంకాలం 6 గంటలకు గౌతమీ గ్రంథాలయానికి చెందిన బాబాయమ్మ మెమోరియల్ హాలులో జరగిన సభలో మధురకవి శ్రీ చేబ్రోలు చిన్మయ బ్రహ్మకవి రచించిన మీరా మనోహర పద్యకావ్యమును రాజోలు ప్రభుత్వ కళాశాల ఆంధ్రశాఖాధ్యక్షులు డాక్టరు శ్రీ జొన్నలగడ్డ మృత్యుంజయరావుగారు ఆవిష్కరించిరి. శ్రీ యర్రోజు మాధవాచార్యులు ఎం. ఏ. మామిడికుదురు కాలేజి ప్రిన్సిపాలు సభకు అధ్యక్షత వహించిరి.

శ్రీ ఆర్. యస్. సుదర్శనము డా. శ్రీ పి. కాశీప్రసాదరావు, శ్రీ డా. జొన్నలగడ్డ మృత్యుంజయరావు. శ్రీ యస్. రామాచారి శ్రీ గ్రంధి సుబ్రహ్మణ్యము, శ్రీ ఏ. సుబ్బా[illegible], డా. శ్రీ క. వెంకట రామరాజు గారలు కావ్య [illegible] ప్రశంసించినారు. శ్రీ యస్. రామాచారి (కాకినాడ పి. టి. ఓ) [illegible] శ్రీ చిన్మయ బ్రహ్మకవి దంపతులను ఘనముగా సన్మానించి[illegible]

( ప్రక్క పుటలో చూడుడు )

## —* రచయితలకు మనవి *—

సంక్షేపముగను, సౌమనస్యముతోఁ గూడినవిగాను, నుండు విమర్శనాత్మక రచనలకు స్వాగతము. గ్రంథవిమర్శకుఁ బ్రాముఖ్యము. ఔచిత్యము మీఱని అభిప్రాయ భేదములకు సముచిత గౌరవము. వాఙ్మయమునఁ జేరఁదగు వివిధాంశములపైఁ దమ రచనలు పంపి మాకుఁ జేయూతనీయఁ బ్రార్థన. రచనలు సరళగ్రాంథికములోఁ గాని, శిష్టవ్యావహారికములోఁ గాని యుండవచ్చును.

వివాదాస్పదములు గాని, చట్టబద్ధమైన, మత, రాజకీయ, ఆర్థిక, శాస్త్రీయ, విజ్ఞాన, పారమార్థిక, సాహిత్యాదులకు సంబంధించి వివిధప్రక్రియలకుఁ జెందిన ఏవిషయములమీఁది రచనలనైనఁ బ్రచురించుట మా యభిలాష.

రచన మాకుఁ జేరిన వారమురోజులలోఁ బ్రచురణకు స్వీకరించిన విషయము రచయితలకుఁ దెలుపఁబడును. స్వీకరింపఁబడనిరచనలు త్రిప్పిపంపుటకు తగిన తపాలా స్టాంపులు రచనలతోపాటు పంపవలయును.

క్రొత్త పుస్తకములను రెవ్యూకి పంపువారు రెండుకాపీలు పంపఁగలరు. పంపఁబడిన ప్రతి పుస్తకముమీఁదను వీలయినంతవఱకు రెవ్యూ ప్రచురింపఁబడును.

— ఎడిటరు.

---



శ్రీ పి. హెచ్. వెంకట సూర్యనారాయణరాజా కావ్యపఠనము గావించిరి. శ్రీ చిన్నయ బ్రహ్మకవి తనకు జరిగిన ప్రశంసా సన్మానములకు సముచితరీతిని సమాధాన మొసగిరి. సంప్రదాయ బద్ధమైన చక్కని కవితను రచించు శ్రీ చిన్నయ బ్రహ్మకవి బహుధా ప్రశంసా సన్మానములకు అర్హుడనుట నిస్సంశయము.

### బ్రాహ్మణ్య ద్వేషము.

"ఆంధ్ర రవాణాశాఖా మంత్రివర్యులు తనవాడి బ్రాహ్మణ్యంమీదనే కాని బ్రాహ్మణులమీద కాదని హైదరాబాదు సభలో తమ బ్రాహ్మణ్యద్వేషమును సమర్థించుకొనినారు. బ్రాహ్మణులలో వ్యక్తిగతంగా దోషము లుండవచ్చును గనుక బ్రాహ్మణులమీది దాడి కొంతవఱకు క్షంతవ్యముగా నుండవచ్చునుగాని బ్రాహ్మణ్య ద్వేషము శ్రేయస్కరము కాజాలదని గ్రహించుట మంచిది.

